# కవిరాజ విజయము

[సాహితీ రూపకము]

రావెల సాంబశివరావు

త్రిపురనేని రామస్వామి చౌదరి సాహితీ సమితి
సిద్ధార్థ ప్రాంగణము
లక్ష్మీపురము, గుంటూరు—522 007

# సమున్నదము

ఇది కవిరాజు త్రిపురనేని రామస్వామి శతజయంతి వేడుకలు జరుపుకుంటున్న వత్సరం.

1987 జనవరి 15, 16, 17 తేదీలలో గుంటూరులో ఉత్సవాలు నిర్వహించి శతజయంతి వేడుకలకు శ్రీకారంచుట్టాం.

నవ్వుతూ నవ్వుతూనే మోయలేని బరువు ఎత్తుకొని అవలీలగా మోసేసాం.

మాకు గొప్పవనిపించిన ఆలోచనలు, మేముమెచ్చిన అందాలు కవిరాజు రచనలలోనివి గుదిగ్రుచ్చి 'కవిరాజమార్గము' అనే సంకలనం రూపొందించాం. ఈ రూపకల్పనలో చేయూతనిచ్చిన ధనేకుల వెంకటేశ్వరరావు, కొల్లా శ్రీకృష్ణరావు, పాపినేని శివశంకర్ గార్లకు మేమెంతో రుణపడ్డాం.

ఈ సంకలనాలు అందరికీ అందించే కృషిలో ఎందరో సహకరించారు. వారందరికీవందనాలు. అందులో ముఖ్యంగా సర్వశ్రీ ఎం. కాశీవిశ్వేశ్వరరావు, ఎల్. రత్తయ్య, ఎమ్. రామారావు వంటి ప్రిన్సిపాల్స్; ఘంటా సుబ్బారావు; సీతాపతి, కొడాలి గోపీచంద్, దొద్దాల శ్రీశైలమల్లికార్జునరావు వంటి ఉపాధ్యాయ నేతలు, పాతూరి కోటేశ్వరరావు, తోటకూర ప్రభాకరరావు, ఎమ్. కోటేశ్వరరావు, జి. వి. రామారావు (గుడివాడ) వంటి లెక్చరర్స్ అందించిన సహకారం ప్రత్యేకించి చెప్పకుండా వుండలేం. డాక్టర్ కాసరనేని సదాశివరావు గారి అధ్యక్షతన ఆహ్వానసంఘం ఏర్పాటయ్యింది. మూడురోజులపాటు సభలు నడిపాం. ఆ మూడురోజులూ కవిరాజు రచించిన నాటకాలు ప్రదర్శింపజేసాం. ఈవిషయంలో సమతానాట్యమండలి, వ్యవస్థాపకులు వరయూరి రామానుజసూరి, శ్రీ హరిహర నాట్యమండలి వ్యవస్థాపకులు సోంపల్లి బావయ్యచౌదరిగార్లు అందించిన సహాయ సహకారాలకు మేము కృతజ్ఞులం.

వేడుకల విశేషాలకు ప్రాచుర్యం కల్పించటంలో సహకరించిన మిత్రులు గుంటుపల్లి నాగేశ్వరరావుగారి కృషి కొనియాడదగినది.

అద్వితీయంగా జరిగిన వేడుకల తీరుకు కార్యకర్తల గుండెలు పొంగి పొర్లాయి. ఉల్లాసం ఉరకలువేసింది. ఇంకేమయినా చేయాలనే పుబలాటం గుబగుబలాడింది.

అదిగో అలాంటి శుభవేళ మళ్ళీ నవ్వుతూ నవ్వుతూ ఒక ఆలోచనచేసాం.

'What next' అన్నారు శ్రీ జొన్నలగడ్డ రామారావు. ఏదయినా వెంటనే జరగాలన్నారు శ్రీ ఆలోకం పెద్దబ్బయ్య.

భువన విజయాలూ, కవన విజయాలూ వున్నాయికదామరి కవిరాజు విజయం తయారు చేయించితే ఎలాఉంటుందీ అన్నారు శ్రీ భాష్యం రామారావు.

ఎవరితోనో వ్రాయించడం ఎందుకు ఆపని సాంబశివరావుదేనని అంతా పురమాయించాం.

ప్రొఫెసర్ ఐ. రామచంద్ర, డాక్టర్ వేతవోలు రామబ్రహ్మంగార్లు ప్రాచీన సాహిత్యంలోని కొన్ని పద్యాలను అందించారు. వారికి కృతజ్ఞులం.

'కవిరాజ విజయం' రచన విని, మా సాంబశివరావు భుజం తట్టిన; జస్టిస్ పి. ఏ. చౌదరి; రావూరి భరద్వాజ; ముకురాల రామారెడ్డి; వి. వి. ఎల్. నరసింహారావు; అంతటి నరసింహం, బుడ్డిగ సుబ్బరామన్; నాగభైరవ కోటేశ్వరరావు, చిన్నం రామయ్యచౌదరి, గురవ్వ చౌదరిగార్లకు కృతజ్ఞులం. తొలిసారి భేష్ చేసినపుడు మాలో గొంతు కలిపిన సాహితీ మిత్రులకు ధన్యవాదాలు.

మా యీ వేడుకలన్నింటిలో ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఎంతో సహాయ సహకారాలందించిన కోటపాటి మురహరిరావు, పావులూరి శ్రీమన్నారాయణ, కురిచేటి వెంకటేశ్వరరావుగార్ల మంచితనాన్ని ప్రత్యేకించి పేర్కొనాల్సివుంది.

అచ్చుపనులు అందంగానూ, సకాలంలోనూ, చేయించి యిస్తున్న శ్రీలక్ష్మీ ప్రెస్ అధినేత బ్రహ్మయ్యగారికీ, వారిఅబ్బాయి శ్యాంబాబుకీ మా ఆనందాన్ని పంచుతున్నాం.

మీ అందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలందిస్తున్నాం.

గుంటూరు
1, జనవరి, 1988

ప్రచురణ కర్తలు.

# తొలి పలుకు

ధర్మసంస్థాపనార్థం సంభవామి యుగే యుగే అన్నాడే కాని, కృష్ణుడు ఏ యుగంలోను తన వాగ్దానాన్ని, నిలబెట్టుకోలేకపోయాడు. కర్ణుడు అధర్మ యుద్ధంలో హతుడయ్యాడు. ద్రౌపది ధర్మరాజు చేతిలో ఒక వస్తువుగా మార్పిడి అయింది. ఈపరిస్థితులలో ధర్మాన్ని నిలబెట్టవలసిన బాధ్యత తనదేనని మానవుడు ఏనాడో గుర్తించి, ఆ బరువు బాధ్యతలను తన భుజస్కంధాలపై మోపుకున్నాడు. హిందూ సంఘంలో అట్టడుగునవున్న వారి విషయంలో ఈబాధ్యత అతి గురుతరమైనదన్న విషయం అనాదిగా గుర్తించబడినది. హిందూ సంఘం సృష్టించిన బ్రహ్మ లిఖించిన ధర్మం ప్రకారం హిందూ సంఘంలో మెజారిటీ వారయిన శూద్రులు అగ్రకులాలవారు సుఖశాంతుల సంరక్షణ, సంపోషణల కొరకు సృష్టింపబడ్డ కొలుముట్టులు మాత్రమే. శూద్రులకు జ్ఞానార్హత లేదు. మోక్షార్హత లేదు. వారితోబాటు స్త్రీలకుకూడా ఎలాంటి హక్కులు లేవు. ఈ స్థితిలో ఏకలవ్యుని బొటనవ్రేలు కోయించిన కిరాతకుడు ద్రోణాచార్యులవారు కావడంలో ఆశ్చర్యపడవలనదేముంది. ఏయితర మతంలోనులేని ఈ అసహనాన్ని అసమానతల్ని సృష్టించింది హిందూ మతం ఒక్కటే అన్న విషయం ఎన్నడూ మర్చిపోరాదు. ఈ ఘోరాన్యాయాన్ని, అధర్మాన్ని స్థాపించింది ఒక్క హిందూ సంఘం మాత్రయే. ఆనాటినుండి మనలో అనేకులు ధర్మప్రవర్తకులు ఈ అధర్మ సంఘాన్ని కూలద్రోయటానికి సరైన ధర్మాన్ని సంస్థాపించడానికి పోరాడారు. వారిలో కరుణామయుడు గౌతమబుద్ధుడు ఆంధ్రులకు సర్వదా ఆరాధ్యుడు. ఈ ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరించి సమానత, స్వేచ్ఛ, కరుణ, సౌభ్రాతృత్వము లోపించిన మూఢవిశ్వాసాలతో ఎండి వాడిపోయిన, అనైక్యతకు గురియైన హిందూసంఘాన్ని సంస్కరింపబూనిన నవీనులలో మేటి కవిరాజు. ఆయనకంటే ముందు ఆంధ్రలో సంఘ సంస్కర్తలు లేరనికాదు. కాని వారెల్లరు ఆర్య వాఙ్మయ ప్రభుత్వ పతాకాల క్రీనీడల మెలగినవారు. ఆర్య వాఙ్మయాన్ని కాలతన్ని నేలవ్రాసినవారు కారు. ఆర్య వాఙ్మయాధికారాన్ని

ప్రశ్నించిన మొట్టమొదటి ఆంధ్రుడు వేమన. రెండవవాడు కవిరాజు. అందుకే మనకెల్లరకు పూజ్యనీయుడు.

కవిరాజుగారి విషయాన్ని హర్షిస్తూ మిత్రులు శ్రీ రావెల సాంబశివరావు గారు కవిరాజుగారి శతజయంతి సందర్భంగా వ్రాసిన నాటకమే ఈ పుస్తకము. ఈ నాటకం చదివి విని ఆనందించాను. కవిరాజు విజయ స్వభావాన్ని ఈ నాటకం రసవత్తరంగా చెవికి ఇంపుగా, కంటికి సొంపుగా వివరించింది. ఆ విజయ సాధనలో ఎన్ని సాంఘిక పరమైన, సాహిత్యపరమైన, శాస్త్రపరమైన అడ్డంకు లున్నాయో చూపుతుంది ఈ నాటకం. కాని ఆ అడ్డంకుల్ని అధిగమించి కవిరాజు జయిస్తాడని ఈ నాటకం నిరూపిస్తుంది. కాలప్రభావాన్ని ఎవరు ఆపగలరు? మానవుడిలో వున్న స్వేచ్ఛా ప్రియత్వం, శాస్త్రీయ దృక్పథం. సమతాభావాల యొక్క విజయమే కవిరాజు విజయం. సంఘసమస్యల్ని ధర్మబుద్ధితో యోచింప చేయడానికి అందరి ఎడల సమాన న్యాయం, కరుణ నెరపడానికి మన సంఘాన్ని చీడపురుగుల్లా యీనాటికి పట్టుకొని వున్న కులమత మూఢ విశ్వాసాలను విసర్జింప చేయడానికి ఆంధ్ర యువతీ యువకులకు ఈ రచన బలమీయగలదని, తోడ్పడగలదని ఆశిస్తున్నాను. ఈ రసవత్ కవిత వ్రాసిన సాంబశివరావుగారిని మనసారా అభినందిస్తున్నాను.

లుంబినీ
1-10-1/16
అశోక్ నగర్,
హైదరాబాదు.

జస్టిస్ పి. ఎ. చౌదరి
6-1-88

# దర్పణం

ఒక గ్రంథం పాఠ్యపుస్తకంగా నిర్ణయింపబడాలంటే దాని వెనుక చాలా గ్రంథం నడుస్తుంది. విజ్ఞులు సమావేశమవుతారు. ఎంతో తర్జనభర్జన జరుగుతుంది. అటువంటి సమావేశానికి వూహాచిత్రం యీ 'కవిరాజ విజయం'

ఇతరుల ప్రభావం వలన వ్రాసిన కవితా ఖండికలను సంపుటీకరించి ప్రకటిస్తే దానికి 'మారుమోతలు' అని పేరుపెట్టాలనుకున్నారట శ్రీశ్రీ! అల్లసానివాని అల్లిక మనుచరిత్రను కూడ అటువంటి మారుమోతల కవిత్వం గానే భావించారాయన!! [చూడండి శ్రీశ్రీ 'అనంతం'

మన పూర్వ కవులవి అనువాదాలలో అందెవేసిన చేతులుకదా? చేతనయిన వాళ్ళు అందంగా మ్రోగిస్తే చేతకానివాళ్ళు ఏదో ఒక మోత మ్రోగించేవాళ్ళు. ఇతర భాషలు అనువాదాలుచేసి వాటిని తమ సొంతంగా చెలామణీ చేసుకునే మహానుభావుల మాటంటారా- వాళ్ళనేమయినా అనేందుకు భాష సరిపోదే! అయినా చూస్తూచూస్తూ వూరకుండేదెలా?!

కవిరాజ విజయం కని కొందరు విస్తుబోవచ్చు. కొందరు తెల్లబోవచ్చు. కొందరి కళ్ళలో ఆనందం తొంగిచూడవచ్చు.

ఎవరెలా స్పందించినా భావవిప్లవంకోసం, నవసమాజ సంస్థాపనకోసం రామస్వామిగారు చేసిన అనన్యమైన కృషిని యిందులో ప్రతిబింబింపజేయటమే మా ధ్యేయమని స్పష్టంచేస్తున్నాం.

ఈ రూపకంలో నాకునచ్చిన విషయాలు నచ్చినట్లుగా నచ్చని విషయాలు నచ్చనట్లుగా ప్రకటించటానికి ప్రయత్నించాను. నా యీ ప్రయత్నంలో విద్యార్థి ప్రతినిధి బాగా చేతికి అందివచ్చాడు.

ఇందులో ఎగతాళివుంది. అలా ఎగతాళి చెయ్యకపోతే యెదుటివాళ్ళను ద్వేషించేంతటి బలహీనత నాలో చోటుచేసుకుంటుందేమోనని భయంవేసింది. నా యీ మాటలు నమ్మలేరా? అయితే అనతోల్‌ఫ్రాన్స్‌నడగండి.

విద్యార్థి ప్రతినిధి అప్పారావు అద్దంపుచ్చుకొని అందులో ఎవరిముఖం వాళ్ళని చూచుకోమంటున్నాడు. కొందరు అద్దంలోని ప్రతిబింబపు అందాలకు అబ్బురపడవచ్చు. కొందరు అద్దాన్ని నిందించే ప్రయత్నం చేయవచ్చు.

'చివరకు మిగిలేది'లో బుచ్చిబాబు అంటాడు,'అద్దంలా దగాచేసే వస్తువు

భౌతిక ప్రపంచంలో మరొకటిలేదు. అందరి మొహాలూ వొంకరగా కనబడ్డాయి. కాని ఎవరికివారు అది తెలుసుకోలేరు. వుంకోళ్ళు చెబితే కోపంవస్తుంది........ చీకాకుపేసే యీ అల్ప వికృతాలని సరిదిద్దుకోవాలని ఎవ్వరికీ అనిపించదు.

సరే అద్దం మీముందుంచుతున్నాం. చూడండి మీరే!

గుంటూరు

మార్చి 1987

రావెల సాంబశివరావు

## ఇందలి పాత్రలు

| | |
|---|---|
| డాక్టర్ వివేకి | సభాధ్యక్షుడు |
| పద్మనాభం | ప్రబంధకవుల ప్రతినిధి |
| కన్నకవి | నన్నయ ప్రతినిధి |
| ధురంధరం | పురాణకవుల ప్రతినిధి |
| మల్లీశ్వరి | కవయిత్రి మొల్ల ప్రతినిధి |
| సింహాద్రి | కవిరాజు ప్రతినిధి |
| దామోదరం | జాషువా ప్రతినిధి |
| నిరంజనం | వేమన ప్రతినిధి |
| అబ్బారావు | విద్యార్థి ప్రతినిధి |
| ప్రయోక్త | సూత్రధారి |

## తొలి పాత్రధారులు

| | |
|---|---|
| డాక్టర్ వివేకి | శ్రీ గద్దే మంగయ్య |
| పద్మనాభం | ప్రొఫెసర్ వి. రామచంద్ర |
| కన్నకవి | శ్రీ గౌరిజవోలు పాండురంగారావు |
| ధురంధరం | శ్రీ కలువకొలను నరసింహమూర్తి |
| మల్లీశ్వరి | శ్రీమతి హేమలత |
| సింహాద్రి | డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం |
| దామోదరం | శ్రీ కొల్లా శ్రీకృష్ణరావు |
| నిరంజనం | శ్రీ ఘంటా నాగేశ్వరరావు |
| అబ్బారావు | శ్రీ ఆలోకం పెద్దబ్బయ్య |
| ప్రయోక్త | శ్రీ రావెల సాంబశివరావు |

# కవిరాజ విజయము

వేదికమీద తొమ్మిది కుర్చీలు. ఒక మూలగా రోష్ట్రమ్. ప్రయోక్త రోష్ట్రమ్ ముందు నిల్చొనివుండగా తెఱ పైకిలేస్తుంది.

(నేపథ్యంలో సినిమాపాటలో మీా భాగం)

కాలేజీ కుర్రవాడ - కులాసాగ తిరిగెటోడ
విలాసాల మాట మరవరో - విద్యార్థి
విప్లవాల బాటనడవరో - విద్యార్థీ
ఛాందస భావాలన్నీ - ఛందస్సున బంధించి
ఊర్వశి 'అందాలుచెప్పి' - పూరించీ పుడికించీ
ముక్తిమార్గమని చెప్పి - భక్తిరసం బోధించే
ఈ తెలుగు పెత్సు చదివితే - ఓ విద్యార్థీ
తెలివి గాలికెగిరిపోయెరో - ఓ విద్యార్థీ ........కాలేజీ........

[తెఱవెనుక నివాదాలు.... విద్యార్థుల ఐక్యత ...........వర్ధిల్లాలి ఈ చదువులు మాకొద్దు. నిరుద్యోగాన్ని తరిమికొట్టాలి. బోధనా మండలిలో విద్యార్థులకు ప్రాతినిధ్యం కావాలి.

ప్రయోక్త : విద్యార్థులారా ఆగండాగండి. మీా అబ్బారావును బోధనామండలి సభ్యునిగా నియమించారు. [నినాదాలు ఆగిపోతాయి]

తెలుగు తేజం విశ్వమంతటా విస్తరిస్తున్నది. యూనివర్సల్ వర్సిటీవారికి తెలుగులో సమగ్రమైన సాహితీ సంభారాన్ని సమకూర్చే ఒక కవిత్వ సంకలనం కావలసి వచ్చింది. అది వారి విద్యార్థులకు పాఠ్యపుస్తకంగా నిర్ణయిస్తారట. అటువంటి సంకలనం ఎంపికచేసి పంపమని త్రిలింగ సాహితీ పరిషత్తును కోరటం జరిగింది. త్రిలింగ సాహితీ పరిషత్తువారు అందు నిమిత్తం వారి బోధనా మండలి అత్యవసర సమావేశం ఏర్పాటు చేసారు.

[డాక్టర్ వివేకి ప్రవేశం]

ఇదిగో వీరే డాక్టర్ వివేకిగారు. బోధనామండలికి అధ్యక్షులు.

వివేకి : ఎంతమార్పు, ఎంతమార్పు! సభ్యులువచ్చి కూర్చున్న తరువాత కదా అధ్యక్షులు రావలసినది. నేను ముందుగావచ్చి సభ్యులకొరకు ఎదురు చూడవలసి వచ్చినది.

ప్రయోక్త : సభ్యులు సభామంటపం వెలువల ఏమేమి మంతనాలు జరుపు చున్నారో! [అబ్బారావు వస్తూండగా]

ఇడుగో, అబ్బారావు. ఇతడే విద్యార్థి ప్రతినిధి.

అబ్బారావు : Good Morning Sir!

వివేకి : చిరంజీవీ కుశలమా?

అబ్బారావు : విద్యార్థిలోకంలో కుశలం ఎక్కడ అధ్యక్షా? మాకు చెప్పే చదువుల్ని చూచి నానేసిన సున్నపురాళ్ళలాగా కుతకుతా వుడికి పోతున్నాం!

వివేకి : మంచిరోజులు రాక మానవు. మీకు వలసిన విద్యనెంచుకొనుటకే కదా బోధనామండలియందు మీకు ప్రాతినిధ్యము కల్పించుట.

అబ్బారావు : ఆరోగ్యకరమైన మీ అభిమతానికి జోహార్లు. కానీ మంది మధ్య నా ఒక్కని మాట ఎంతవరకు చెల్లుతుంది అధ్యక్షా!

వివేకి : చూతము. చూతము [అబ్బారావు కుర్చీలో కూర్చుంటాడు]

[కన్నకవి ప్రవేశిస్తూండగా]

ప్రయోక్త : ఉగ్రతాంబూలం దట్టించి - అదే ఉగ్రతాంబూలం అంటే మరేం లేదు కారాకిళ్ళీ! - అది దట్టించి వస్తున్నవారు కన్నకవి. ఇవి ఆగ్రతాంబూలాలకు రోజులు కావని ఉగ్రతాంబూలానికే వువ్విళ్ళూరుతున్నాడు. ఆదికవికి వారసుడనని ఎంతో బిఱ్ఱు. ఆదికవి పేర పీఠం నెలకొల్పి నిర్వహిస్తున్న సాహితీ సమా రాధకుడు.

కన్నకవి : [చేతిలో పుస్తకం వున్నందున తలవంచి] అధ్యక్షులవారికి అభివాదములు.

వివేకి : [చిరునవ్వుతో స్వీకరించి] ఆర్యా! కన్నకవీ! ఆ హస్తభూషణం ఏయ్యది.

కన్నకవి : ఆసి కవియును, వాగనుశాసనుండును నగు మానన్నయార్య ప్రణీతం బయిన యాది పర్వము.

వివేకి : బాగు బాగు

అబ్బారావు : ఏది బాగు అధ్యక్షా? మాంసం తినేవాళ్ళు బొమికెలు మెడలో వేసుకు తిరగాలా!

కన్నకవి : లేదు నాయనా! పంతులు చెప్పు పాఠములు గాలికి వదలి పగటి కలలు కనవలెను.

అబ్బారావు : పంతుళ్ళు చెప్పేవి గాలి కబుర్లుగాను, పగటి కలలేమో పసందుగానువుండే దుర్దశ అసలు ఎందుకు పట్టాలి కన్నకవిగారూ?

కన్నకవి : ఏమి చేయగలము బాబూ! గ్రుడ్డొచ్చి పిల్లను వెక్కిరించు రోజులు వచ్చి పడినవి.

అబ్బారావు : మీవి పిల్ల వ్యవహారము లయినపుడు వెక్కిరింతలు తప్పవు కదా!

కన్నకవి : అధ్యక్షా! చూచితిరా యీతడి యఘాయిత్యము. ఇందులకే యిట్టి సభలలో విద్యార్థులకు ప్రాతినిధ్యము వలదంటిమి.

అబ్బారావు : అవును.... బావిలోని కప్పలు అంతకుమించి ఏమనగలవు!

వివేకి : నాయనా అబ్బారావూ.... పెద్దలను తూలనాడకు.

అబ్బారావు : ఎవరండీ పెద్దలు? వయస్సు మీదపడినవారా పెద్దలు?! సద్బుద్ధి కలవారినే కదా అధ్యక్షా పెద్దలుగా పరిగణించవలసింది?

[ఆచార్య ధురంధరం ప్రవేశం]

ప్రయోక్త : వస్తున్న వారే ఆచార్య ధురంధరంగారు. ఆయనకు పాండితీ పటిమ వుంది. గుర్తింపులేదు. మాట కటువు, మనసు మెత్తన. ప్రొఫెసర్ కావాలనుకుంటే డాక్టరేట్ లేకపోవటం యిబ్బంది అయ్యింది. అందువల్లనే ధురంధరాచార్యలోని ఆచార్య శబ్దం ముందుకుతెచ్చి ఆచార్య ధురంధరంగా చెలామణీ అవుతున్నారు.
[పుస్తకములు వొడిలో వుంచుకొని కుర్చీలో కూర్చుంటాడు]

వివేకి : ఆచార్యా ! ఏమవి పలుగ్రంథములు తెచ్చితిరి?

ధురంధరం : పురాణములు సభాపతీ.

అబ్బారావు : పుక్కిటి పురాణములు కాబోలు!

ధురంధరం : పిల్లకాకికేమి తెలియును ఉండేలు దెబ్బ?

అబ్బారావు : పోనీ పెద్ద కాకులే పంచుకోండి. ఆ ఉండేలు దెబ్బలన్నీ!

కన్నకవి : డాక్టరేట్ లేనివారి కామాత్రపు పెద్దరికమయినను అవాంఛనీయమే అబ్బారావూ!

ధురంధరం : మీ డాక్టరేట్ల బండారము తెలియనంతటి అజ్ఞానములో మేము కొట్టుమిట్టాడుట లేదులేవయ్యా కన్నకవీ!

వివేకి అంతటితో సరిపుచ్చుట మంచిది. కడుపు చించుకొనిన కాళ్ళ మీద పడును. [ప్రొఫెసర్ పద్మనాభం ప్రవేశిస్తూండగా]

ప్రయోక్త మృష్టాన్న భోజనము ముగించి, కప్పురపు విడెము గుప్పు గుప్పు మన తూగుటుయ్యెల నూగియూగి అరుదెంచుచున్నవారు ప్రొఫెసర్ పద్మనాభంగారు.

కన్నకవి [లేచి నిలుచుండి సాదరంగా] ప్రొఫెసర్ పద్మనాభంగారికి స్వాగతము సుస్వాగతము.

అబ్బారావు : ధురంధరంగారూ.... స్వాగతం అంటే ఏమిటి? సుస్వాగతం అంటే ఏమిటి?

ధురంధరం : కన్నకవినే యేల ప్రశ్నింపవు? ఆయనకు డాక్టరేటుకూడ ఉన్నది కదా!

అబ్బారావు దానికేముంది అడగవచ్చు. ప్రొఫెసర్ పద్మనాభంగారు తూగుటుయ్యేలలూగువారు కదా. కనుక వొకపూపుకు స్వాగతము మరో పూపుకు సుస్వాగతము అంటూ కన్నకవిగారు భాష్యం పలుకుతారేమోనని భయంగావుంది!

పద్మనాభం [వల్లెవాటు సవరించుకుంటూ] అహో! ఎవరో యీ కుర్రడు! వచ్చిరాని పలుకులతో ముద్దులు కురిపించుచున్నాడే!

అబ్బారావు శివ శివా! మీ ముద్దులు మావద్దకూ తెచ్చారా!

[అందరూ నవ్వుచుండగా మల్లీశ్వరీదేవి ప్రవేశం]

ప్రయోక్త ఈమె మల్లీశ్వరీదేవిగారు. మొల్లమీద అథారిటీ. మొల్లకు మించిన వారు మరొకరున్నారంటే వొప్పుకోరు.

[కుర్చీలో కూర్చుంటుంది]

పద్మనాభం : ఏమమ్మా మల్లమ్మా! మీ మొల్ల ఏమంటున్నది?

మల్లీశ్వరి : ఏమన్నా అనుకున్నా 'ఊతునా' అని మాత్రం అనదు తాతగారూ!

అబ్బారావు : చూడండి మల్లీశ్వరిగారూ మన పద్మనాభంగారు పెద్దనకేకాదు ప్రతినిధి, ఆయన ప్రబంధ కవులందరి ప్రతినిధి.

మల్లీశ్వరి : ఏమి ప్రబంధకవులో నా బొందకవులు! స్త్రీల యంగాంగ వర్ణన గావించినగాని కుతితీరని కక్కుర్తి కవులు.

అబ్బారావు : రంభకొరకు అంగలార్చెడి పండితుల పరంపరకదా వారిది మేడమ్!

పద్మనాభం : పిట్ట కొంచెము కూతఘనముగా ఉన్నదే ఈ కుర్రని వ్యవహారము.

కన్నకవి : అతడు సామాన్యుడను కొంటిరా పద్మనాభం గారూ?!

అబ్బారావు : మాన్యుడనయిన సామాన్యుడనాలేక సామాన్యుడనయినమాన్యుడనా మాష్టారూ?!

వివేకి : అబ్బారావూ.... గురువులనటుల అవహేళన గావింపవచ్చునా? తప్పు నాయనా. [నిరంజనం ప్రవేశం]

ప్రయో_ : వీరు నిరంజనంగారు. స్థానిక కళాశాలలో తెలుగు శాఖాధ్యక్షులు వేమన కవితా తత్వంపై పరిశోధన జరిపి పట్టం పుచ్చుకున్నవారు. వేమనవలె మొగమాటము లేకుండ, ముక్కుసూటిగ, కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడగలరు.

కన్నకవి : నిరంజనంగారూ! కౌలుకు తీసుకున్న పొలములోని ప్రత్తిపంట మీది శ్రద్ధ పాఠాలమీద ఉండదని మీ ప్రిన్సిపాలుగారు చాటు మాటుగా అనుచున్నారని వినుచున్నాము.

నిరంజనం : ఆయన ముఖంలే.... ఆయన సైడ్ బిజనెస్ సంగతెవరికి తెలియదు కన్నకవిగారూ?

అబ్బారావు : నిరంజనం మాష్టారూ. వాళ్ళ మాటలకేంగాని మీరువచ్చికూర్చోండి.

కన్నకవి : అవునవును, అటే వెళ్ళండి నిరంజనంగారూ పసలేని కవిత్వ మునకు పట్టముగట్టి యూరేగువారికి పసివారి ప్రక్కనే మరిచోటు!

నిరంజనం : ఇదిగో చూడండి కన్నకవిగారూ.... బండరాళ్ళవంటి పెద్ద పెద్ద సమాసాలు దొర్లించి ఎక్కడో ఒకటో అరో తెలుగుపదం తగి లించి దానినే తెలుగు కవిత్వంగా చెలామణీ చేసినవాళ్ళని భుజాల మీద ఎక్కించుకుని ఊరేగించేవాళ్ళకి తెలుగు నుడికారపు సొంపు సొంపులెలా తెలుస్తాయి? మీలో ఎలాగూ మార్పురాదు. అభం

శుభం తెలియని పసివాళ్ళనయినా పసివాడకుండ తీర్చిదిద్దనివ్వండి. వేమన సూక్తులు వంటబట్ట నివ్వండి.

[వచ్చి అబ్బారావు ప్రక్కన కూర్చుంటాడు]

మల్లీశ్వరి : మా బాగా చెప్పారు నిరంజనంగారూ. బంగపోత పోసినట్లు సంస్కృతం పడజిమ్మే శకం ఏనాడో ముగిసింది.

నిరంజనం : పిల్ల చచ్చినా పురిటికంపు పోనట్లు తెలుగుబాస కన్నె దగ్గర సంస్కృతపు పురిటికంపు ఇంకా కొడుతూనేవుంది మల్లీశ్వరిగారు!

ధురంధరం : డాక్టరేట్లుకూడ వాడుక భాషలో వ్రాసుకొమ్మని విశ్వవిద్యాలయాలు జారీచేయుచున్న హుకుం దెబ్బకు తెలుగు మాత్రము నిలిచు చచ్చునాయేమి?

అబ్బారావు : రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల్లో వాడుకునే భాషలో కండగల తెలుగుందని అంటారు కదండీ పద్మనాభంగారూ.

పద్మనాభం : క్రొవ్వెక్కి కండబట్టినవాడు కూసే ప్రతికూతా తెలుగుగా చెలా మణీ కాగల రోజులువచ్చాయి నాయనా!

అబ్బారావు అన్నన్నా! అలాంటివాళ్ళు మాట్లాడేది ముమ్మాటికీ సంస్కృతమే నండీ! [సింహాద్రిగారు ప్రవేశిస్తూండగా]

ప్రయోక్త : ఈయన సింహాద్రిగారు, హేతువాది. చెడుకు చెవియొగ్గడు. తంతులకు తలవొగ్గడు, కవిరాజు రచనలపట్ల, ఆలోచనలపట్ల వల్లమాలిన అభిమానము.

కన్నకవి : ఇంతకూ ఏ కవిరాజో!

అబ్బారావు : మీకెందుకా అనుమానం కన్నకవిగారూ? కవిరాజంటే త్రిపురనేని రామస్వామిగారే. మా రామబ్రహ్మం మాష్టారు ఆయన మీద చెప్పిన యీ పద్యభాగం వినలేదా?

........బృహత్కావ్యాళి నిర్మించుటన్
కవిరాజాఖ్య వహించితీవిది మరొక్కండెవ్వడేదాల్చుబో
శివుడుం దాండవమాడనాడవె పిశాచీభూత భేతాళముల్.

సింహాద్రి : [కరచాలనం చేస్తూ] సెహభాష్ అబ్బారావ్!
[కుర్చీలో కూర్చుంటాడు]

ప్రయోక్త : ఇంకొక్కరు రావలె. ఎవరు చెప్మా!.... ఆ! దామోదరంగారు. అదిగో మాటలోనే వస్తున్నారు. జాషువా కవితకు హారతిపడతారు. ఆ దారినే కవితా వ్యాసంగం చేస్తుంటారు.

కన్నకవి : పోగాలము దాపురించినది. అందరును కవితలల్లువారే!

దామోదరం : [రోషంగా] మీవంటివారికి మా గురువుగారేమని సమాధానము చెప్పిరో తెలియదా కన్నకవిగారూ!

కన్నకవి : [వెటకారంగా] ఏమని చెప్పిరో!

దామోదరం : [ఆవేశంగా] హుం.... ఏమని చెప్పిరా.... ఆయన మాటలే వినండి.

గవ్వకు సాటిరాని పలుగాకుల మూకలసూయ చేత న
న్నెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే?
యివ్వసుధాస్థలిం బొడమరే రసలుబ్ధులు? గంటమూనెదన్
రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్

సింహాద్రి : చాలు మిత్రమా చాలు. మరల నోరెత్తకుండ చేసినావు.
[తోడ్కొనివచ్చి ప్రక్క కుర్చీలో కూర్చుండబెట్టును]

దామోదరం : [కూర్చునికూడ రుసరుసలాడు తుంటాడు]

నిరంజనం : మనసు కలతబెట్టుకొనకు దామోదరా. ఆ బానిస కొడుకుల మాటలకేమిలే.

అబ్బారావు : బానిస కొడుకులేమిటి నిరంజనంగారూ.

నిరంజనం : కులము కలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడి కల్గువాని బానిస కొడుకులు - అన్నాడులే వేమన్న.

కన్నకవి : ఎడ్డె మనుష్యునికేం తెలుస్తుంది లక్ష్మీవైభోగం.... లక్ష్మీదేవి కటాక్షించెనా....

పండితుడాత, డాతడు ప్రభావ సముద్రుడతండుశూరు, డా
తండు వివేకి, యాతడు వదాన్యుడతండు మహాకులీను డా
తండు కళావిదుండతడు ధన్యుడతండు మనోజ్ఞమూర్తి, యె
వ్వండు భవత్కృపాకలన వైభవలక్ష్మికి పాత్రుడిందిరా!

అబ్బారావు : డబ్బుంటే చాలు ఏదయినా కావచ్చన్న మాట!

నిరంజనం అవును భోజరాజుకూడ కావచ్చు.

అబ్బారావు అదెలా మాష్టారూ!

నిరంజనం ఈ రోజుల్లో భోజనాలు పెట్టినవాడే భోజరాజు. రంగు రంగుల శాలువాలు అందించినవాడే రాజబంధువు.

పద్మనాభం : ఇదిగో అబ్బాయిలూ.... మీరెన్ని వెటకారాలు పోయినా డబ్బున్న వాడిని గెల్వగలవాడెవడు. ఈలోకంలో! ఆతనికెంత మన్నన; మర్యాద! అందుకే ఎవరినయినా లక్ష్మి చల్లగా చూసిందా—
[పొడిదగ్గు దగ్గి గొంతు సరిజేసుకొని]

ఎవ్వని నేని నీవు దయనించుక చూచినవాని జూతు ర
పువ్విలుకానిగా సతులు, భూపతిగా ప్రజ, కల్పకంబుగా
నవ్విబుధాశ్రిత ప్రతతి, యంబుధిగా కులగోత్ర గోత్రజుల్
కవ్వడిగా పరద్విషులు, కర్ణునిగా కవులెల్ల శ్రీసతీ!

అప్పారావు : శ్రీసతీ అన్నారు. పతియేమైపోయాడు పద్మనాభంగారూ!

ధురంధరం : ఆ సతివుంటే నేనయ్యా పతికి గతి!

కనులనయిన నీవు కలచోటు సరసంబు
నీవులేని చోటు నీరసంబు
కంబుకంఠి నీవు కలవాడు కలవాడు
లేనివాడు నీవు లేనివాడు!

అప్పారావు : అబ్బో పెద్ద పీటేవేసారే లక్ష్మికి!

నిరంజనం : వేస్తారులే అప్పారావ్. పీటకేముంది ఎవరికయినా వెయ్యొచ్చు. వాళ్ళు చెప్పేది కలవారి సంగతి. మా వేమన చెప్పింది కలవారి జానిస కొడుకుల సంగతి.

అప్పారావు : పసిడికల్గువాడు అంటే rich classకు చెందినవాడా లేక Neo rich classకు చెందినవాడా మాష్టారూ?

నిరంజనం : ఏరాయయితేనేం పళ్ళూడగొట్టటానికి!

అప్పారావు : అబ్బే యిప్పుడు రాళ్ళవసరం లేదండి. డాక్టర్లలో Specialists వున్నారు పళ్ళూడగొట్టటానికి!

కన్నకవి : పట్టలేనంత వెటకారం పోతున్నారుగాని అసలు వేమన్న పసిడి కోసం ఎందుకు పరితపించాడో పాపం!

నిరంజనం : తానుకూడ జానిసకొడుకుల్ని కొందరినికని లోకంమీదికి వొదులు దామనుకున్నాడేమో!

వివేకి : ఇప్పటికే సమావేశము ప్రారంభమగుటకు జాప్యము జరిగినది. ఎజెండా ప్రకారము సభను నడుపుకొందము.

ప్రయోక్త : ఇంక సభ్యులమధ్య నేనుండటం సబబుగా వుండదు. డాక్టర్ వివేకిగారి అధ్యక్షతన జరిగే బోధనామండలి సమావేశ విశేషాలను మీతో కలసి నేను గమనిస్తాను. [ప్రయోక్త నిష్క్రమణ]

వివేకి : మన సమావేశము ఎప్పటివలెనే ప్రార్థనతో ప్రారంభింతము. పద్మనాభంగారు ప్రార్థన గావించెదరు.

పద్మనాభం : అంకముఁజేరి శైల తనయాస్తన దుగ్ధములానువేళ బా
ల్యాంక విచేష్ట తొండమున నవ్వలిచన్ గబళింపబోయి యా
వంక కుచంబుగానక హిమవల్ల భహారము గాంచివే మృణా
ళాంకుర శంకనంటెడు గజాస్యునిగొల్తు నభీష్ట సిద్ధికిన్

అబ్బారావు : శంక అంటున్నారేమిటది నిరంజనంగారూ?!

దామోదరం : ఇందరు గురువులున్నను నీ శంకతీరదా అబ్బారావ్?

అబ్బారావు : లఘు శంకలు గురువులు తీర్చగలరా మాష్టారూ!

వివేకి : అబ్బారావూ కొంచెము అల్లరి తగ్గింపుము.

అబ్బారావు : అదికాదు అధ్యక్షా అసలు యిటువంటి సభలకు ప్రార్థనలుకావాలా? పోనీ కావాలనుకుంటే యేవయినా మేలుకొలుపు గీతాలు పాడ వచ్చునుగా.

ధురంధరం : అపునవును పాడటానికి ఈ ధురంధరం వున్నాడుగా!

మేలుకో శ్రీరంగ మేలుకో రంగా
మేలుకొని యేలుకో మమ్మేలుకోవయ్యా
[తన్మయత్వంతో రాగాలాపన చేస్తూండగా]

సింహాద్రి : మేలుకొలుపు గీతాలంటే అవటయ్యా ధురంధరం? జీవరహితమైన

రాతిబొమ్మలకు కాదయ్యా మేలుకొలుపులు పాడవలసింది. జాతిని జాగృతం చేసేదానికి పాడాలయ్యా మేలుకొలుపులు.

మలమల మాడు పొట్ట, తెగమాసినబట్ట, కలంత పెట్టగా
విలవిల యేడ్చుచున్న నిఱుపేదకు జాలిని జూపకుండ నుత్తల పడిపోయి జీవరహితమ్మగు బొమ్మకు నిండ్లువాకిళుల్
పాలమును బొట్టనిచ్చెడి ప్రబుద్ధవదాన్యుల నిచ్చ మెచ్చెదన్

దామోదరం : దేవుళ్ళపై మేలుకొలుపు లెన్నిపాడి ఏమి ప్రయోజనం? జాషువాకవి ఈ విషయంలో ఏమన్నారో తెలుసా

ప్రతిమల పెండ్లిసేయుటకు వందలువేలు వ్యయింత్రుగాని దుః
ఖితమతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదిల్చదీ భరతమేదిని; ముప్పదిమూడుకోట్ల దే
వతలెగవడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులారునే!

అబ్బారావు : చెయ్యెత్తి జైకొట్ట లేకపోయినా లాల్‌సలామ్ పెట్టలేకపోయినా తెలుగుతల్లికి మల్లెపూదండ వేయవచ్చును గదా!

సింహాద్రి : అబ్బారావ్! తెలుగు భాషామతల్లికి కవిరాజు సమర్పించిన నీరాజనం నీదృష్టికి రాలేదా?

అబ్బారావు ఏది వినిపించండి.

సింహాద్రి మాల దాసరినోట, మహితభూసురు నోట
నొకరీతి మాటాడి యొప్పినావు
మాలవాడల బాట, మహితభూసురుపేట
నొక్కరీతిగ జిందు ద్రొక్కినావు
మాలగేస్తుని యింట, మహిత భూసురు నింట
నొకరీతి బధములు నుంచినావు

మాలపెద్దల చెవి, మహిత భూసురు చెవి
నొకరీతి సామెత లూదినావు
కన్నబిడ్డల డెసనొక్క కనికరంబె
చూపి, యెల్లవారికి దారి చూపినావు
తల్లి! నీమాట నీపాట దలచుకొన్న
జలదరించును మేనెల్ల పులకరించు.

అబ్బారావు : ఇటువంటి సభలకు ప్రార్థనాగీతంగా వుండదగినదిదే. దీనిని మనం ప్రార్థనాగీతంగా స్వీకరిస్తూ తీర్మానించవలసిందిగా కోరుతున్నా.

దామోదరం నేనా ప్రతిపాదనను బలపరుస్తున్నా.

మల్లీశ్వరి · తల్లి .... మాటలునేర్పిన తల్లి ... పాటలునేర్పిన తల్లి .... ఆహా తల్లిమాట తలచుకుంటేనే మేనెల్ల పులకరింత. నేనాప్రతిపాదనను సమర్థిస్తున్నాను.

నిరంజనం : నా ఓటూ అదే

అబ్బారావు : మెజారిటీ లభించింది అధ్యక్షా!

కన్నకవి : నీకసలు మైనారిటీ తీరిందా అబ్బారావూ?
[నిశ్శబ్దంగా వుండమని సూచిస్తూ బెల్ నొక్కి]

వివేకి : కవిరాజుగారి పద్యం మన సభలకు ప్రార్థనాగీతంగా వుంటుందని ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

పద్మనాభం : మెజారిటీ సభ్యుల సమ్మతిపై తీర్మానించటమైనదని వ్రాయించండి అధ్యక్షా.

అబ్బారావు : ప్రొఫెసర్ సాబ్! మీరు మైనారిటీ వర్గాలలో చేరిపోయి లాభాలు పొందాలని చూస్తున్నారా?

కన్నకవి : అలాంటికర్మ మాకేంపట్టలేదు. ప్రయోజనమున్నా లేకున్నా మా అసమ్మతిని మేము ప్రకటించుకొనగూడదా?

వివేకి : అబ్బారావూ! మీ తీర్మానము నెగ్గినదికదా. ఇంక వాదనలేల?

దామోదరం : ఇంతకూ యీ అత్యవసర సమావేశం హఠాత్తుగా ఎందుకు ఏర్పాటు చేసినట్లధ్యక్షా?

కన్నకవి : అందరికంటే ఆలస్యంగా మీరు వస్తారని!

దామోదరం : మీవలె ప్రచురణకర్తల కార్లలో వూరేగే అలవాట్లు మాకులేవులే కన్నకవిగారూ!

అబ్బారావు : ఏదీ ఆ కోతికారులోనేనా దామోదరంగారూ!

నిరంజనం : కోతికారా లేక కోతివారికారా అబ్బారావ్!

వివేకి : [బెల్ నొక్కి] చూడండి........ మనము ఈ సమావేశమునందు సమగ్రమైన సాహితీ సంభారమును సమకూర్చు కవితాసంకలనము నొకదానిని ఎంపిక చేయవలసి యున్నది. యూనివర్సల్‌వర్సిటీ వారు దానిని పాఠ్యగ్రంధంగా స్వీకరిస్తారట.

కన్నకవి : దానికి చర్చయేల అధ్యక్షా! నన్నయ ప్రణీతంబగు నాదిపర్వమందుల కన్నివిధముల తగినదికదా.

నిరంజనం : ఎందువలననో....

కన్నకవి : మా నన్నయ భారతరచనకెందులకు ప్రక్రమించెనో తెలిసినవారికిట్టి సందేహములు పొడసూపవు.

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తిలో
నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెను గునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్.

అబ్బారావు : ఇదేదో ఎద్దందం పనిపందం పద్ధతిలోవుందే కన్నకవిగారూ!

కన్నకవి : అపచారం........ అపచారం........ ఆదికవిని ఎంతలేసి మాటలను చున్నాడు!

నీరంజనం ఏమిటీ నన్నయ ఆదికవా? అంతకుముందు కవులేలేరా? కవిత్వమేలేదా?

కన్నకవి ఉన్నదో చెప్పవచ్చునుగదా నిరంజనంగారూ?

సింహాద్రి ఇటువంటి పేచీలు ఊహించే మా కవిరాజు నిర్మొహమాటంగా తేల్చిచెప్పాడండీ కన్నకవిగారూ!

పద్మనాభం ఏమనిస్వామీ?

సింహాద్రి ఏమనా?.... కవిత్వం ఒకడబ్బసొమ్ముకాదనీ.... వొక్కూపున అది ఆకాశంనుండీ వూడిపడదని.... క్రమక్రమంగా అదివృద్ధి చెందిందనీ, చెందుతుందనీను!

మోటమానిసినోట మోజు చిందులుద్రొక్క
పనితంపు పాటల బాడ నేర్చి
జోలపాటలు నేర్చి యేల పాటలు నేర్చి
గొబ్బిళ్ళ పాటల గునుకు నేర్చి
తేవారములు నేర్చి ద్విపదలెన్నియొ నేర్చి
త్రిపద చౌక్కపు నడ తీరు నేర్చి
రగడ లెన్నియొ నేర్చి రహీనక్కరలు నేర్చి
జంగమకథ మేలు చాలు నేర్చి

చాలగీతముల్ నేర్చి సీసములు నేర్చి
వెండిబంగారు పద్దెముల్ వెండి నేర్చి
ప్రౌఢ పిల్లలై పాతరలాడ నేర్చె
తెలుగు కబ్బపు గన్నియ తెలివితోడ.

ఇ.తియేకాని, నన్నయ ఎంతగాగ
బుణికి గంటము జేబట్టి కణతల దర
గైత బుట్టించెనను మాట కల్లమాట!

విరంజనం : ఈ యాదియాంధ్రకవి తంతు యిలావుంటే సంస్కృతంలో అది
కవిగా పేరు గడించిన వారెలాంటివారో సింహాద్రిగారూ!

సింహాద్రి : ఆయనకూడ తక్కువ తినలేదు. పేరులు మార్చి పేరు
గడించిచినవాడు

పేరులు మార్చినాడు తలపెట్టి దురర్థము రాగగొన్నిటిన్
బేరులు మార్చినాడు తలపెట్టి యపార్థము రాగగొన్నిటిన్
బేరులు మార్చి మాఱుతున, పేరు ప్రతిష్టను బాడుచేయుచున్
బేరుగడించె నాదికవిపేరు పొగ ర్తజంగము నిండగన్

అబ్బారావు : సరేయిక వాగను శాసననుడిమాటేమిటి?

కన్నకవి : నీవు అధికముగా వాగకు అబ్బారావ్

అబ్బారావు : అది మీ శాసనమా లేక వాగను శాసనమా కన్నకవిగారూ!

వివేకి : [బెల్ మోగించి] సభ్యులు పరస్పర నిందలకు దిగుట మంచిది
కాదు. ఈ పాఠ్యగ్రంథపు ఎంపికలో మీ యభిప్రాయమేమి
పద్మనాభంగారూ?

ధురంధరం : పంచమ వేదమగు భారతముదే కాదనిన వారితో పద్మనాభంగారు
వాదించి ప్రయోజనమేమున్నది అధ్యక్షా!

నిరంజనం : ఏమిటేమిటీ! భారతం పంచమవేదమా?

పంచమ నిగమంబు భారతంబగునని
పొగిడిరేల జనులు బుద్ధిమాలి!
హింసనెంచిచూడ నిష్టమెట్లయ్యెనో
విశ్వదాభిరామ వినురవేమ,

కన్నకవి : అధ్యక్షా వింటిరా?

వివేకి  ఎవరి యభిప్రాయములు వారివి. మీ యభిప్రాయములు తెలియ జేయుడు పద్మనాభంగారూ.

పద్మనాభం : భారత భాగవతములు చదువకపోయినను ఫరవాలేదుగాని మన చరిత్రము చదువనిచో మనభాషలో పండితుడనుటకు వీలులేదు.

సింహాద్రి : అవునవును.... ఎలావీలవుతుంది! "ఇనుపకచ్చడాల్ గట్టుకొను మునిమ్రుచ్చుతెల్ల" అని వ్రాసే పండిత పరంపరను తయారు చేసినవారుకదా!

ధురంధరం : అందేమి దోషము కలదు సింహాద్రిగారూ?

దామోదరం : మునిమ్రుచ్చు దగ్గరేమో పేచీ! మునిశబ్దమునకు మ్రుచ్చని అర్థము కలదుగదా. అంతేనా సింహాద్రిగారూ.

సింహాద్రి : అవును దరిదాపు, దారిడొంక, తెరవుతెన్నువంటి సమాసమే మునిమ్రుచ్చని తెలియక మునిశబ్దమును సాంస్కృతికమని భ్రమపడి తాపసిగా చెలామణీ చేయటం జరిగింది.

తన్నకవి : మీరు మెచ్చుకొను కవులయినను అట్టి గ్రంథములు చదువకయే పండితులయినారా?

అబ్బారావు : ఒకవేళ పండితులకు పనికివస్తాయనుకున్నా అవిపిల్లలకెందుకండీ? అవి చదివి పిల్లలు పిండితార్థాలెవరికి చెప్పాలండీ?

పద్మనాభం : తెలుగువారి మొట్టమొదటి స్వతంత్ర కావ్యముగా నయినను దానిని బఠింపబనిలేదాబాబూ!

సింహాద్రి : ఇష్టదేవతా స్తుతినే కాదంటిమికదా పద్మనాభంగారూ.

పద్మనాభం : మీ నాస్తికులటులనే యన్నింటిని కాదందురు.

సింహాద్రి అవును మోకాలికి బట్టతలకు ముడిబెట్టజూచు విషయమున్నింటిని కాదందుము. సహేతుకమైన ప్రతిదానికీ సరేయందుము.

కన్నకవి మా నన్నయగారు వ్రాసిన భారతము తెలుగులో మహాగ్రంథమెట్లో అట్లే మను చరిత్రము తెలుగులో మొదటి స్వతంత్ర కావ్యము కదా.

అబ్బారావు : అరెరే! 'అట్లే' అంటే ఆకలి గుర్తు కొచ్చింది. అధ్యక్షా ఇంతకూ మా సభ్యులకు విందుభోజనాలు ఎందుకు ఏర్పాటుచేయరు?

వివేకి రిజిష్ట్రారు వారికి వ్రాసి తెలిసికొందము.

దామోదరం సరిసరి దానికి సమాధానం వచ్చేటప్పటికి మా సభ్యత్వానికి కాలం చెల్లిపోతుంది.

ధురంధరం : కనీసం ఉపాహారపు టేర్పాట్లయినను గావింపవచ్చునుగదా అధ్యక్షా!

పద్మనాభం ఫలాహారమయినను సరే.

కన్నకవి జీడిపప్పు పకోడీలు పంటిక్రిందికి పసందుగా వుంటాయనుకుంటి!

పద్మనాభం బాదం హల్వా దానికి జత

మల్లీశ్వరి కజ్జికాయలెంత కమ్మగావుంటాయో

సింహాద్రి ఆ రిజిష్ట్రారుగారి సంగతి మీకెవరికీ సరిగా తెలిసినట్లు లేదు. ఆయనకు వొళ్ళంతా చెతురే! ఈ జాబితా చదవగానే వేవిళ్ళెవరికని వెటకారం చేస్తారు!

వివేకి [బెల్ నొక్కి] రసనవిందుల విషయాన్నలా వదలి వచనవిందుల విషయానికిరండి.

పద్మనాభం   మను చరిత్రము పంచకావ్యములలో మొదటిది.

అప్పారావు   ఇప్పుడు పంచెలజతకొరకు పంచరత్నములు వ్రాసినట్లే అప్పుడు దేనికోసం పంచకావ్యాలు వ్రాసారో?

కన్నకవి   అదేపనిగా అలా కొంటెకోణంగితనం ప్రదర్శిస్తూంటే చూస్తూ ఊరుకుంటారేం అధ్యక్షా? మరీ రంధ్రాన్వేషణ పెచ్చరిల్లు తున్నది.

అప్పారావు : అవును శృంగారనైషధంలో 'బువ్వనబంతి' చూస్తే యెవరిది రంధ్రాన్వేషణో అందరికీ బాగానే అర్థమవుతుంది. అద్దాలుపెట్టి మరీ చేసారటగా రంధ్రాన్వేషణ!

వివేకి : అప్పారావూ సభను సాఫీగా సాగనివ్వనాయనా.

నిరంజనం : అటువంటిదానినే కదండీ వారు రసరాజమని లొట్టలేస్తున్నది. ఉన్నమాటంటే ఉలుకెందుకు?

పద్మనాభం : ఇట్టి సభలలో యెల్లరకు ప్రానిధ్యముండుట మనకర్మ.

కన్నకవి : అవును కర్మమే - అసలు గీతాకారుడేమన్నాడంటే -

అప్పారావు : కల్లుతాగమన్నాడు!

దామోదరం : గీసేవాణ్ణీ నేనే, గీయించేవాణ్ణీ నేనేనన్నాడు?
గీసీగీయగానే తాగమన్నాడు. తాగకపోతే
నీకర్మ నేనేంచేస్తానన్నాడు. కల్లు పులవకపోతే
అమృతమే పొమ్మన్నాడు. పులిసింది తాగితేమాత్రం
వాణ్ణెవరూ పట్టలేరు పొమ్మన్నాడు!

పద్మనాభం : ఇక అసలు మేం మాట్లాడం అధ్యక్షా.

కన్నకవి : [లేచి నిలబడి] అసలు పోదాంపదండి పద్మనాభంగారూ. ఈ వితండవాదాలతో మనకెందుకు?

మల్లీశ్వరి : నల్వురున్నచోట నాల్గు మాటలు తప్పవు. అన్నీ తెలిసిన మీరే అలాఅంటే ఎలా? మీవాదన కొనసాగించండి.

కన్నకవి : [కూర్చుని] అదికాదమ్మా గీతామృతము పొంది పరవశుడు కానివాడెవ్వడు.

అబ్బారావు : అది ఏనాటిమాటో. నేడు జనం రికార్డుడాన్సుకీ, క్రికెట్ ఆటకీ పరవశం చెందుతున్నారు. వాటిమీదకూడ కావ్యాలల్లుతారా కన్నకవిగారూ?

వివేకి : మీరు కానివ్వండి పద్మనాభంగారూ.

పద్మనాభం : మను చరిత్రమందెంతటి కథనమున్నది. ఒక్కొక్క పద్యము రస నిష్యందముకదా. ఓహో అందలి హిమాద్రిశోభలే శోభలు.

అటఁజనికాంచె భూమిసురుఁ డంబర చుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ దభంగ తరంగ మృగంద నిస్వన
స్ఫుటనటనానుకూల పరిఫుల్ల కలాప కలాపిజాలమున్
గటక చరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్.

నిరంజనం : చూడకుండా వ్రాస్తే అలాగేవుంటాయండీ

పద్మనాభం : ఎందువలన?

నిరంజనం : మీ పెద్ద.... అదే మీ పెద్దన అసలు నల్లమలకొండలయినా సరిగా చూశాడా? చూడకుండా వ్రాసే కవిత్వం అలాగే తగలడుతుంది.

కన్నకవి : ఓహో మీవేమన్న అన్నీ చూచే వ్రాసాడుకాబోలు నిరంజనంగారూ!

నిరంజనం : లోకాన్ని చూచి చూచి, తరచి తరచి, ఆచితూచి వ్రాశాడు వేమన కవిత్వం.

ధురంధరం : మా కవులవి చూచివ్రాతలు కావులే!

నిరంజనం : మక్కికి మక్కిదించిన మీకవులెంతటి స్వతంత్రులో జగమెరుగదా దురంధరంగారూ?

పద్మనాభం : పెద్దనని ఆడిపోసుకునేవాళ్ళ విషయంలో వాళ్ళని యెద్దనవలెనా, మొద్దనవలెనాయని యందులకేయనినది.

అబ్బారావు : ఆ యప్పుసంగతలా వదలండి. చూడకుండా వ్రాస్తే మాత్రం చిక్కులు తప్పవు. హైదరాబాద్ నగరపు నడిబొడ్డున చెలియలి కట్ట సృష్టించి దానిమీద ప్రేమికుల్ని చెట్టాపట్టాలేసుకుని తిరిగేట్లు చేసాం.

సింహాద్రి [పుస్తకం అబ్బారావుకిస్తూ] ఇదిగో యిదిచదువు అబ్బారావూ

అబ్బారావు [తనలో తాను చదువుకుంటూ నవ్వుతాడు]

సింహాద్రి నీలోనువ్వు అలా చదువుకుంటే ఎలా? పెద్దగా చదువు అబ్బారావ్! అందరూ వింటారు

అబ్బారావు : [పైకి చదువుతాడు]

తెలుగుబిడ్డా! తెలుగు చరితను
నేటికైనను దెలిసికోరా!!
ఢిల్లి దగ్గర గంగ యుండెనొ?
గంగ యొద్దన ఢిల్లి యుండెనో!
గంగ మీదను బడవ యెక్కిన
ఓరుగంటిని జేరగలడే?
ఔర! వెంకటరాయశాస్త్రీ
ఔర! వెంకటరాయశాస్త్రీ
ఎంత బొంకును బొంకిపోతివి
చచ్చి మెచ్చుటనుంటివోకద
తెలుగు బిడ్డా! తెలుగు చరితను
నేటికైనను దెలిసికోరా!!

పద్మనాభం : "మంచిగనే సదివినవ్ బిడ్డా!"

నిరంజనం : చదివిన తీరేనా నచ్చింది తమకి ఆచార్యా? వ్రాత నచ్చలేదా?

అప్పారావు : వ్రాతంటారేమిటి మాష్టారూ - అలా అన్ని వాతలు పెడుతూంటే!

దామోదరం : ఎన్ని వాతలుపెట్టి ఏం ప్రయోజనం. నేడు వచ్చే పిచ్చిరాతలు చూచుంటే కవిరాజనలేమనేవాడో!

వివేకి : [బెల్ నొక్కి] తిరిగి పెద్దన విషయమునకు దృష్టిసారింపుడు

కన్నకవి : హిమాలయముల గూర్చి వర్ణించవలెనన్న చూచి వ్రాయవలసిన యగత్యమేమున్నది? "రవిగాంచనిచో కవిగాంచునే కదా!" కనుక నదియెట్లుండునో ఊహించి వ్రాసెను పెద్దన.

పద్మనాభం : అహో! హిమాలయములు చూచి కవిత్వము వ్రాసినవారు కూడ కలరా?

అప్పారావు : లేకేమండీ. ఇటీవల భూటాన్ వెళ్ళొచ్చిన మా రాంబ్రహ్మం మాష్టారు అవధానంలో అడిగితే అవలీలగా యిలాచెప్పారు.

ఆకాశాంచల వీధులం దొకడు మాయాదండ విన్యాస రే
ఖాక్లుప్తిన్ తలక్రిందుగా బహుళవృక్షశ్రేణి కల్పించినా
డో కాదేనిది యేమి మింటిమొగమై యొప్పారి వీక్షించుచో
నాకుల్ కొమ్మలు మ్రాకులున్ జలద బృందాంతర్ధి గన్పించుటల్

సింహాద్రి : కవిరాజుగారు చూచిన హిమాచలములివిగో సందర్శించండి.

చదల దాకు మ్రానిమొదలు, కొదులు పొదల
మొదలు తుమ్మెదల రొదలు, కదులు నదులు
విదులు క్రొందావి విరిసు త్తి పదులు పొదలు
మొదలు తుదిలేని ముదిగొండ మొదలు గంటి!

ధురంధరం : మీ రసరాజుగారు ఛేకానుప్రాసచేత పూడిగం బాగానే చేయించారు గాని మరి ఓజోగుణం మాటేమిటి సింహాద్రిగారూ?

సింహాద్రి : ఓజోగుణమా? దానికిమాత్రం ఏంకొదవ? ఇదిగో చూడండి–

గోలాంగూల లులాయ సూకర తరక్షు వ్యాళశుండాల శా
ర్దూలవ్యాఘ్ర హరీంద్ర సాలముఖ జంతుప్రాప్త హింతాల త
క్కోల వ్యాఘ్రనఖ తమాల శాల వివిధక్షోణీజ సంతాన మా
భీలంబై కనుపట్టెదుంగ హిమవద్భీమాటవీ ఘాటమున్.

ఇంకనూ ఆయన చూచిన హిమాలయముల తీరునుగందురా.

చూచితిఁగందళీ పిహిత సుందర కందర మందిరావళుల్
చూచితి మాతులుంగతతి లుంగ లవంగ లతాకుడుంగముల్
చూచితి నంబరావరణ చుంబి ధరాధర తుంగ శృంగముల్
చూచితి సిద్ధమౌని జనశుద్ధ సమిద్ధ కుటీర పద్ధతుల్

పద్మనాభం : సింహాద్రిగారూ! మీరెన్ని చెప్పినను ఆంధ్రకవితా పితామహుని భాషావైదుష్యము, భావగాంభీర్యము, లోక విజ్ఞానము, కల్పనా చాతుర్యము, శయ్యాసౌభాగ్యము........

నిరంజనం : అవునవును – తలక్రింద పెట్టుకొని విశ్రమిస్తే శయ్యాసౌఖ్యము బాగానే సమకూరుతుంది పద్మనాభంగారూ!

ధురంధరం : ఇదిగో నిరంజనం నీ వెటకారానికేంగాని అసలు అల్లసాని వాని యల్లిక జిగిబిగి వేరొకనికెక్కడిదయ్యా.

నిరంజనం : ఆ గజిబిజి పిల్లలకెందుకులెండి ధురంధరంగారూ!

పద్మనాభం : తల్లీ పల్లీశ్వరీ! మనుచరిత్ర యందలి అశ్వహృదయ విద్యా విశేషములు జ్ఞప్తియందున్నవా?

మల్లీశ్వరి : ఇందీవరాక్షుడు మనోరమకందించినదేనా? ఏదీ వివరింపుడు. మననము చేసికొనెదను.

పద్మనాభం : అస్త్రహృదయ విద్యను శివుడు స్వాయంభువ మనువునకిచ్చెను. ఆ మనువునుండి దానిని వసిష్ఠుడు స్వీకరించెను. వసిష్ఠుడద్దాని చిత్రాయుధునకిడెను. చిత్రాయుధుడది ఇందీవరాక్షునకందించెను. ఇందీవరాక్షుడు మనోరమ కొసగెను. తనను తరుముచున్న రక్కసుని చంపుటకు మనోరమ దానిని స్వరోచివరముజేసెను.

సింహాద్రి : దానిని మనోరమే ప్రయోగింప వచ్చునుకదా?

పద్మనాభం : అది విద్యనాయనా! విద్యయనగా మంత్రము. ఉపనయనము లేనివారు కావున స్త్రీలు మంత్రములను ప్రయోగించలేరు.

సింహాద్రి : ఓహో! అటులనాస్వామీ! మరి అదితెలిసిన ఇందీవరాక్షుడేల దానిని మనోరమ కందించెను?

పద్మనాభం : ఆపదనలో నదియామె పురుషున కందించి ప్రయోగింప జేయ వచ్చును.

సింహాద్రి : మరి.... సమయమునకు పురుషుడు దొరకకున్నచో

దామోదరం : ఆమగువపని గోవిందా.... గోవింద!

మల్లీశ్వరి : అయ్యో! స్త్రీలకెంతటి దుస్థితి! చేత విద్యయుండియు ప్రయోగింప వీలుకాని కట్టడి.

దామోదరం : అందుకే జాషువాగారేమన్నారో తెలుసా మల్లీశ్వరిగారూ?

"అబలయన్న బిరుదమటించి కాంతల
స్వీయశక్తులదిమి చిదిమినారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడన చేసికొమ్ము కష్టచరిత"

సింహాద్రి : కనుక మీకు చదువులపట్ల చక్కని ఉత్సాహం ఉండాలి మల్లీశ్వరి గారూ. చదువుకొన్న భార్య సంసారమును చక్కదిద్దగలదు.

నిరంజనం : తన చిన్ని కుటుంబాన్నేకాదు యావత్ ప్రపంచాన్ని దిద్దగలదు.

సింహాద్రి : కనుక పిట్టకథలకు పుట్టినిండ్లయిన పురాణముల, ప్రబంధముల జోలికి పోకండి. జ్ఞానము, విజ్ఞానము అందించే పుస్తకాలు చదవండి.

అబ్బారావు : సింహాద్రిగారూ.... ఇంకెక్కడి జ్ఞానమూ విజ్ఞానమూనండీ! ఇప్పుడు మగువలంతా నవలా వలయంలో చిక్కుకు పోయారు. పిశాచి ఘోర భేతాళ కథలు వాళ్ళనుక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

మల్లీశ్వరి : ఏ భయాలయినా దరిజేరకుండా వుండాలంటే

రామనామమే లడ్డుండ
అది తినేవారికే తీపంట"

అని భక్తిపారవశ్యంతో పాడుకోవాలి.

సింహాద్రి : తల్లీ నువ్వు మళ్ళీ మొదటికొచ్చావా?

మల్లీశ్వరి : మీరు ఎన్నైనా చెప్పండి నేనొప్పుకోను. లక్షణంగా పిల్లలచేత మొల్ల రామాయణం పారాయణం చేయించాల్సిందేనంటాను.

శ్రీ మహిమాభిరాముడు వసిష్ఠ మహాముని పూజితుండు సు
త్రామవధూ కళాభరణ రక్షకుడాశ్రిత పోషకుండు దూ
ర్వామల సన్నిభాంగుడు మహాగుణశాలి దయాపరుడు శ్రీ
రాముడు ప్రోచు భక్తతతి రంజిలునట్లుగ నెల్లకాలమున్.

సింహాద్రి : చూడమ్మా ... అది రాముడి గొప్పదనం కాదమ్మా

మల్లీశ్వరి : [ఆశ్చర్యంగా] మరి!

సింహాద్రి : రఘుకులంబునఁ బుట్టెనే రాముకన్న
గొప్పవారు? వారలపేరు లెప్పుడైన
వింటిమే? సత్కవి కటాక్ష వితతిచేత
మాన్యుడయ్యెను రాముండు మల్లి తల్లి!

ధురంధరం : పోనీరండి మావాళ్ళని సత్కవులన్నారు అంతేచాలు

దామోదరం : ఆగండాగండి కవులను జాషువాగారేవిధంగా చిత్రించారో వినండి!

కవులని యొక తెగ కలరట
భువికిన్ మింటికిని త్రాళ్ళు ముడివైచి మహీ
ధవు లిచ్చు ఖదరు శాల్వల
పువ్వుదండల మురిసిపోవు పుట్టు దరిద్రుల్!

సింహాద్రి : మల్లీశ్వరిగారూ! ఇంతకూ నే చెప్పేదేమంటే.... "పురుషులతో సమానముగ బోటులు సర్వకళాభిరాములై" యీ సమాజాన్ని ముందుకు మున్ముందుకు నడిపించాలి మీరు రాముని ఒకవైపు నుండే చూస్తున్నారు. ఇదిగో మరోవైపునుండికూడ చూడండి....

శబరి భక్తిని గనిపెట్టి సంతసించి
కంటి చూపుతో మోక్షంబు గట్టబెట్టె!
శంబుకుని తపంబును మెచ్చి సాహసించి
కత్తివేటుతో మోక్షంబు గట్టిపెట్టె!

అంతేకాదు

సంశయించు భర్త సాహచర్యముఁ జేయు
సాధ్యపడునె యెట్టి సాధ్వికైన?
సీత భూమిజొచ్చె శ్రీరామచంద్రునిఁ
గూడి యుండలేక కుప్పుసామి

మల్లీశ్వరి : సింహాద్రిగారూ! మీ రామస్వామిగారెన్ని చెప్పినను నాకుమాత్రము భక్తి భావమునకు మించినది మరొక్కటి కానరాదు. ఆ గుహుని భక్తిభావము నందెంతటి విస్మయత!

సుడిగొని రామపాదములు సోకిన ధూళివహించి రాయి యే
ర్పడ నొక కాంతయయ్యెనట పన్నగ నీతని పాద రేణు వి
య్యెడజడి యోడసోకనిది యేమగునోయని సంశయాత్ముడై
కడిగె గుహుండు రామపదకంజయుగమ్ము భయంబుపెంపునన్.

అబ్బారావు : అందులో భయంతప్ప భక్తి యెక్కడుంది మేడమ్?

మల్లీశ్వరి : నీకు బొత్తిగా భయంలేకుండా పోయింది అబ్బారావ్!

అబ్బారావు : హాస్యంకాదు మేడమ్! రాముడి పాదధూళి రాయికి తగిలి స్త్రీగా మారినట్లే, నావకి తగిలి నావకూడ స్త్రీగా మారితే - తన జీవనాధారమైన నావపోగా ఆ స్త్రీని వెంటబెట్టుకొని ఇంటికెళితే యిదెవ్వతని పెళ్ళాం తెచ్చు తీసుకుంటుందేమోననే భయంతో గుహుడు గజగజా వణికి రాముడికాళ్ళు కడిగాడు గాని భక్తితో కాదుమేడమ్!

మల్లీశ్వరి : నీ వితండ వాదానికేంలే అబ్బారావ్!

అబ్బారావు : పోనీ అలా అనుకున్నా తిండివాదాలకంటే వితండవాదాలు ఎంతో మేలుకదా మేడమ్

వివేకి : [బెల్‌నొక్కి] వివాదాలు మాని పాఠ్య పుస్తక నిర్ణయం చేయండి.

సింహాద్రి : అతిమధురము, అతిపేశలము, అతిపేయమునగు తెలుగు భాష యందలి యందచందంబు లన్నియు అందుండవలె.

ధురంధరం : బాగున్నది. అటులయిన మా కవిసార్వభౌముడందుకు తగినవాడు కదా

అబ్బారావు : ఇంతకూ తెలుగు కవితా ప్రపంచంలో చక్రవర్తులకు, పాదుషాలకు, సార్వభౌములకు ఏంకొదవ? ఎవరా సార్వభౌముడు?

ధురంధరం : ఎవరా - కంచుఢక్క నుగ్గుగావించిన శ్రీనాథ కవిసార్వభౌముడు.

అబ్బారావు : అంత పసగలదా ఆయన కవిత్వము

ధురంధరం : ఆయన పలుకులే విను. అవన ఏదో నీకే తెలుస్తుంది!

పంపా విరూపాక్ష బహు జటాజూటికా
రగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగవీచీ ఘటా
గంభీర ఘుమఘుమారంభములకు
కళసాపుర ప్రాంత కదళీ వనాంతర
ద్రాక్షాలతా ఫల స్తబకములకు
కర్ణాట కామినీ కర్ణ హాటక రత్న
తాటంక యుగ ధాళ ధళ్యములకు
నిబ్బబంధ నిబంధమైనెనియు కవిత
తెలుగునను సంస్కృతంబున బలుకనేర్తు
దీపికాలుండ కర్ణాట దేశ కటక
పద్మ వన హేళి శ్రీనాథభట్ట సుకవి.

అటువంటి మహాకవి శ్రీనాధుని కాశీఖండము నెన్నుకొనవచ్చునుగదా.

పద్మనాభం : కాశీఖండముకన్న శృంగార నైషధమో, శివరాత్రి మాహాత్మ్యమో పఠింప బాగుండును.

అబ్బారావు : ఆయన రాత్రి మహాత్మ్యాలూ, పచ్చి శృంగారాలూ మాకు వంచి పెడదామనా. ఊరూరా ఆయనకు వేసిన పీటలు చాలు, వేస్తున్న వేషాలుచాలు,

పద్మనాభం  శృంగారం రసరాజమని తెలియదా నాయనా?

కన్నకవి  అదికూడ తెలిస్తే మననింక బ్రతకనిస్తారా?

అబ్బారావు  ఏది తెలిసేది!.... శృంగారమేనా? మాకు శృంగారం తెలిస్తే మిమ్మల్ని బ్రతకనివ్వక పోవటమేమిటి కన్నకవిగారూ!

నిరంజనం  అదిసరేగాని అప్పటి సీసాల కవులకు యిప్పటి సీసాల కవులకు పెద్ద తేడాయేమీ లేదంటున్నారు రుచితెలిసినవాళ్ళు.

ధురంధరం  ఓహో మీ ఆటవెలదులే కాబోలు మత్తునివ్వనివి?

అబ్బారావు  సీసాలను చేజిక్కించుకున్న వాడు అటవెలదుల నెందుకు పొటులుతాడండీ?

వివేకి  చర్చ ప్రక్కదారికి మళ్ళినట్లున్నది.

అబ్బారావు  ఆటవెలదులనగానే ఆ వీధికి మళ్ళారేమో!

వివేకి  అబ్బారావ్ నువ్వు కొంచెమాగునాయనా

అబ్బారావు : అబ్బే నేనావీధికి వెళ్ళడంలేదు అధ్యక్షా! [అందరూ నవ్వుతారు]

సింహాద్రి  కవిత్వానికి రసం ఒక్కటివుంటే సరిపోతుందా?

పద్మనాభం  [వెటకారంగా] మరింకేంకావాలో?!

సింహాద్రి  మీ అప్పకవి చెప్పలేదా పద్మనాభంగారూ?

పద్మనాభం  మా అప్పకవి ఎందుకు చెప్పలేదూ.... ఉపమగల్గినను, శయ్యల నొప్పియున్నను/అంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబు కాదని చెప్పెనుకదా! అది మీకు తెలియదా?!

సింహాద్రి  తెలుసు తెలుసు. మీకుత్సితపు బుద్ధులన్నీ తెలుసు. పరుల ప్రతిభ జూచి, శ్రమజూచి, ప్రథజూచి కార్య పటిమజూచి కన్నుగుటి

కూసిన కూతయ్యా అది. అసలు కవిత్వానికి కులానికి యేమిటి సంబంధం? శూద్రుడి సేవలుకావాలి? తూగుటుయ్యెల కావాలి? అందులో వూగుతూ తూగుతూ అల్లిబిల్లి వూహాలు మీరల్లాలి? అసలు శూద్రుడెవడయ్యా? ఎవడు సృష్టించాడీ శూద్రుణ్ణి?

అబ్బారావు : శూద్రుడి సంగతి తరువాత చూద్దాంకానీ అసలీయంఘ్రిభవు డెవరండీ?

సింహాద్రి : అంఘ్రిభవుడనగా కాళ్ళనుండి పుట్టినవాడు

అబ్బారావు : కాళ్ళనుండి కూడ పుడతారా సింహాద్రిగారూ?!

సింహాద్రి ఆసంగతి వాళ్ళనే అడుగు!

కన్నకవి : అప్పకవి నటుల వెక్కిరింపబనిలేదు. యజుర్వేదము నందలి పురుషసూక్తములోని ఈ మంత్రము వినుడు.

బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్
బాహూరాజన్య కృతః
ఊరూ తదస్యయద్ వైశ్యః
పద్భ్యాగ్ం శూద్రో జాయత

అనగా బ్రాహ్మణులు భగవంతుని ముఖమునుండియు, క్షత్రియులు బాహువుల నుండియు, వైశ్యులు తొడలనుండియు, శూద్రులు పాదముల నుండియు నుద్భవించిరని దీనియర్థము.

అబ్బారావు : అలాఅయితే మీ వేదాల ప్రకారము అమ్మకు అయ్యకు పుట్టినవాడు ఒక్కడూ లేడన్న మాట!

దామోదరం : సింహాద్రిగారూ మీరు శూద్రుడెవరని నిలదీస్తున్నారు. అక్కడితో ఆగిందా? పంచముడి సృష్టిజరిగింది.

"ముసలివాడైన బ్రహ్మకో పుట్టినారు
నలుగురు కుమారులనట విన్నాముకాని
పసరమునకన్న హీనుడభాగ్యుడైన
అయిదవ కులస్థుడెవ్వరమ్మా సవిత్రి" అని జాషువాగారు నిలదీసి
ఏం ప్రయోజనం? కడజాతివానిమీద కసరి బుసకొడుతూనేవున్నాడు
నాల్గు పడగల హైందవ నాగరాజు.

అబ్బూరావు : నాల్గు పడగలేం కర్మ వేయి పడగలతో కొట్టే బుస విన్పించటం లేదా దామోదరంగారూ?

వివేకి : వర్ణముల విషయము నటవదలి వర్ణనముల విషయమును చేపట్టుడు.

కన్నకవి : వర్ణముల విషయమున కూడ మా నన్నయను మించినవాడులేడు. మచ్చుకు ఈ పద్యము వినుడు.

శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులన్
చారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధబంధురో
దార సమీర సౌరభముదాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి పూరము లంబరపూరితంబులై

అబ్బూరావు : అప్పే యిందులో ఒక్క తెలుగు పదం కూడ లేదే.

నిరంజనం : అబ్బూరావ్! నన్నయ ఆది పర్వారంభములోనే "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు" అంటూ ఒక శార్దూలాన్ని వదిలాడయ్యా! తెలుగు పేరుచెప్పి గీర్వాణం వెలగబెట్టాడయ్యా.

అబ్బూరావు : అయితే కవులు శాస్త్రాలాలు, మత్తేభాలతో పర్యటనలు చేయిస్తా రన్నమాట!

సింహాద్రి : చేయిస్తారని మెల్లగా అంటారేంబాబూ! చిత్రకవిత్వాలు, బంధ కవిత్వాలు నీకు తెలియవా! వాటినిండా ఎన్ని దొమ్మరమొగ్గలో!

అబ్బారావు : మాకివన్నీ తెలియక పోవటంతో కొంత బ్రతికిపోయామన్నమాట

కన్నకవి : అసలేమీ తెలియనివాడు యింకా బాగా బ్రతుకుతాడు బాబూ!

అబ్బారావు : ఏదీ! మీరు నిర్వహించే సాహితీ సభలకు అధ్యక్షత వహిస్తూనా?

ధురంధరం : వారు నిర్వహించే సభలకు దక్షులైన అధ్యక్షులుంటారని తెలియదా అబ్బారావూ?!

అబ్బారావు : మిమ్మాచాయలకు రానివ్వరుకదా? ఆ విషయం మీకెలా తెలుసు ధురంధరంగారూ?

ధురంధరం : నువ్వు మరీ యింత గడుసు పిండానివనుకోలేదు అబ్బారావ్!. అదిసరేగాని మా పోతన మాటేమిటంటారు?

బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
కూళలకిచ్చి యప్పడుపు కూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతర సీమల కందమూల కౌ
ద్దాలికులైననేమి నిజదార సుతోదర పోషణార్థమై.

అని చెప్పినవాడుకదా పోతన.

నిరంజనం : ఆపద్యం అసలు పోతన సొంతంగా వ్రాసిందేనా?

పద్మనాభం : భాగవతమంతా వ్రాసినవాడామాత్రం పద్యం వ్రాయలేడా?

నిరంజనం : ఆయన శక్తిని శంకించికాదు అడగటం. నిజానిజాలు తెలుసుకుందామనే.

కన్నకవి : ఈమధ్య ఒక వాదము లేవదీశారులెండి అందులోనివి రెండు పంక్తులో మూడుపంక్తులో మంచన వ్రాసాడని.

అబ్బారావు : అయ్యబాబోయ్ అంతవంచనా? అందుకే కాళన్న భలేఅన్నాడు.

నిరంజనం : ఏమని అబ్బారావ్?

అబ్బారావు : ఎవరిదయినా పద్యమయినా, గద్యమయినా, మాటయినా పాటయినా వాడుకున్నప్పుడు ఫలానా వారిదని చెప్తే 'కొటేషన్' - అది చెప్పకుంటే 'కొట్టేసెన్'!

దామోదరం : అబద్ధాలాడటానికి ఆమాత్రం రాయితీలు ప్రకటించారుతే అబ్బారావ్!

అబ్బారావు : ఏదీ— "వారి జాతులందు వైవాహికములందు
ప్రాణ విత్త మానభంగమందు
చకిత గోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు అఘము బొందదధిప" అనా!

మరి యీ లెక్కన యిక అబద్ధం ఆడకుండా వుండాల్సిన సందర్భమేది?

కన్నకవి : అది శుక్రనీతికదా?

నిరంజనం : అయితేనేం కన్నకవిగారూ. దానికిలోకవ్యాప్తి భాగవతం మూలంగానేగదా. ఈ మాయదారి సాహిత్యంవల్ల సమాజంలో విలువలు ఎంతగా దిగజారిపోయాయో మీరే చూస్తున్నారుకదా.

కన్నకవి : ఏంవిడ్డూరంగా మాట్లాడతారు నిరంజనంగారూ! సాహితీపరంగా దిగజారిన విలువలకే మేము కలతజెందుతూవుంటే ప్రాచీన సాహిత్యం వలన సమాజంలో విలువలు దిగజారాయి అంటే ఏమి చెప్పము?!

దామోదరం : పాతది కనుక పనికిరాదనీ, కొత్తది కనుక కావిలించుకోవాలనీ మేమనటంలేదు కన్నికపిగారూ!

మల్లీశ్వరి : మన పురాణాలు చదివిన తల్లి ప్రహ్లాదునివంటి కొడుకు కావాలని కోరుకుంటుంది కదండీ?

నిరంజనం : తండ్రులు పరశురాముని వంటి కొడుకులు కావాలని కోరుకోరూ మల్లీశ్వరిగారూ?

సింహాద్రి : అంతేనా! అవకాశంకోసం ఎదురుచూసే యిరుగు పొరుగు వాళ్ళేమో విభీషణుడివంటి సోదరులకోసం ఎదురుచూస్తారు!

అబ్బారావు : దాంతో ఫామిలీ ప్లానింగ్‌తో పనిలేకుండానే జనాభా సమస్య తీరిపోతుంది!

ధురంధరం : అధ్యక్షా! అబ్బారావు అల్లరికేమిగాని అష్టదిగ్గజములలో ఏయొకని రచనమునయినను పాఠ్యగ్రంథముగా సిఫారసు చేయవచ్చునుగదా!

దామోదరం : అష్టదిగ్గజాలేమిటండీ ధురంధరంగారూ.....అంతకుముందువాళ్ళూ, వాళ్ళూ అందరందరే మహనీయులని అందరికీ కలిపి ఒకే నమస్కారం పెట్టి వూరకున్నారు జాషువాగారు. మీకు తెలియదా?

పద్మనాభం : ఎందువలన?

దామోదరం : ఎందువలనా? జాషువాగారి మాటలే వినండి.

విజయ విలాసుని వినుతింపదలచిన
జక్కన్న కోరమీసాలుదువ్వె
జక్కన్న కవనంబు చక్కనిదని పక్క
బినవీరకవి నాల్క వెళ్ళబెట్టె
బిన వీరకవి పల్కు వెలదికి మగఁడన్న
గండపెండారంబు ఘల్లుమనియె

బెద్దన్న కవితకు బెదతౌతయునిపల్క-
నామభూషణుఁ డంబరంబు సూచె
భట్టు మూర్తికిఁ గవిరాజు పట్టమీయఁ
దిట్టి లింగడు చేపలబుట్ట సూచె
నందఱందులు మహనీయులని తలంచి
మొక్క నమస్కార మొనరించి యూరకుంటి.

పద్మనాభం : ఏంచేస్తాం నాయనా....

ఎంత మంచివానికేని గుప్పెడు మసి
పూయగలరు దుష్ట పురుషులిచట
ఎంత చనటనేసి ఇంద్రుడుగా చంద్రుడుగా
ఘన ప్రతిష్ఠ పులుమగలరు నరులు.

దామోదరం : అయ్యో! పద్మనాభంగారూ! ఆమాత్రం తెలియలేదా? అవి మీవంటి వారిని దృష్టిలో పెట్టుకొని జాషువగారు పలికిన పలుకులండీ!

పద్మనాభం : ఆ పలుకులతో మాకేమి పనిగాని గంటమును జుంటితేనియలో ముంచి సృజియించిన మధురాతి మధురమైన కవితలను కూడ కాదందురా?

అప్పారావు : నాకు తెలియక అడుగుతాను. గంటమునుజుంటి తేనియలో ముంచి వ్రాస్తే చీమలు తాటాకుల్తోసహా తినెయ్యవా పద్మనాభంగారూ?!

కన్నకవి : అధ్యక్షా! ఈ బోధనామండలి సభ్యత్వము మనల నవమానముల పాలు గావించుటకా?

పద్మనాభం : అన్నియూ నేవో వింత ఊహలు, విద్దూరపు వాదనలు

ంధరం : వీరి ధోరణిజూడ 'తాచెడ్డకోతి వనమెల్ల చెరచినట్లుండె.

కన్నకవి : అధ్యక్షులవారు మౌనము వహింపవారు మరింత పేట్రేగుచున్నారు.

పద్మనాభం : పెద్ద చిన్న, మంచి మర్యాద లేకుండ పోయినవి.

కన్నకవి : రాక్షసులగూర్చి ఇతఃపూర్వము వింటిమేగాని నేడు ప్రత్యక్షముగ జూచుచుంటిమి.

అబ్బారావు : అధ్యక్షా! చదువు చెప్పెనవారని యింతవరకు నోరెత్తలేదు.

దామోదరం : మంచీమర్యాదా తెలిసినవాళ్ళు సభామర్యాదను యిలాగేకాబోలు కాపాడేది!

సింహాద్రి : వీళ్ళనని యేంప్రయోజనం? మనల్ని చూచి వీళ్ళు రాక్షసులన్నట్లే వారిపెద్దలు మనవంటి వారికి చేటచెవులు, పెద్దకోరలు, పొడవాంటి గోళ్ళు తగిలించి రాక్షసులుగా చెలామణీచేయలేదూ.

కన్నకవి : [లేచి నిలబడి] అధ్యక్షా! వ్యవహారం యింతదూరం నడిచిన తరువాత మేము సమావేశంలో ఒక్కక్షణంకూడ వుండం. లెండి పద్మనాభంగారూ 'వాకౌట్' చేద్దాం.

నిరంజనం : ఇదేం అసెంబ్లీ అనుకున్నారా వాకౌట్ చేయటానికి?

అబ్బారావు : టి.ఏ; డి ఏ.లు ఇంకా చెల్లించలేదుగదండి? అవి పుచ్చుకోకుండా వాళ్ళెలా వెళ్తారులే నిరంజనంమాష్టారూ!

నేత : అబ్బారావ్ నువ్వూరుకోవయ్యా. కన్నకవిగారూ మీరుకూర్చోండి. [కన్నకవిగారు కూర్చుంటారు]

వివేక : [బెల్ నొక్కి] సభలో నిట్టి పరిణామము నేనూహించుచునేయున్నాను. వ్యక్తిగత దూషణలకు దిగవలదని హితవు పలుకుచునే యున్నాను. పాఠ్యగ్రంథ నిర్ణయమున మీరేమయినను చెప్పవలసి యున్నదా ధురంధరంగారూ?

ధురంధరం : ప్రాచీన కవులు సామాన్యులా యేమి?

యతి విటుఁడు గాకపోవు బెట్లన్నదీయ
కాన్య శృంగార వర్ణనా కర్ణనమున
విటుఁడు యతిగాక పోవునే వెసమదీయ
కావ్య ప్రాగ్ర్య వర్ణనా కర్ణనమున

అని మనోహరముగా వివరించినవాడు మా సంకుసాల నృసింహకవి

అబ్బారావు : ఈయనెవరండీ? పేరెప్పుడూ విన్నట్లులేదే?

నిరంజనం : ఆయన పిల్ల వసు చరిత్రకారుడులే!

అబ్బారావు : మొదట నన్నుపిల్లకాకికేమి తెలుసులే అన్నారు. ఇప్పుడేమో పిల్లవస్తాదులను గోదాలోకి దించుతున్నారు!

నిరంజనం : పెద్దపెద్ద మల్లయోధులే చిత్తయితే యింక యీ పిల్ల వస్తాదు విషయం పెద్దగా పట్టించుకోవలసిన పనేముందిలే అబ్బారావ్!

పద్మనాభం : అధ్యక్షా! ఇక మేము వాదించి ప్రయోజనములేదు. కవిత్వమున వారికేమి కావలయునో చెప్పమనుడు.

వివేకి : పలువురు మాటాడిన గందరగోళముగా నుండును. ఈ పక్షమునకు ప్రాతినిధ్యమువహించి మీరు సమాధానమిడుదురా సింహాద్రిగారూ?

సింహాద్రి : అలాగే అధ్యక్షా.

పాయక పూర్వగాథలని ప్రత్న కవీంద్రులు నేఁటి దాఁక రా
మాయణ భారతాది కృతులన్నియు వ్రాసిరి త్రిప్పిత్రిప్పి యే
దోయొక కబ్బమంచుఁ దలకొక్కటి యక్కట! నూతనాంశమే
దో యొకటేనియుం దెలుపనోపని గ్రంథసమూహ మేటికో?

అని రామస్వామిగారివలె ప్రశ్నించుకొని నూతనాంశముల

రాశులు బోయవలె. సత్యనిష్ఠ యుండవలె. నుడికారపు సొంపు కావలె. భావ విప్లవమునకు నూతన చైతన్యమునకు దారిచూపవలె.

కన్నకవి : వాటన్నిటిని రంగరించి కవితల్లిన కవిగాని, గుదిగ్రుచ్చిన గ్రంథముగాని కలదా సింహాద్రిగారూ?

పద్మనాభం : ఆ ప్రశ్న ఆయననడుగ బనియేమున్నది? త్రిపురనేని రామస్వామి యనీ, సూతపురాణమనీ బదులు చెప్పను.

సింహాద్రి : అందుకే శ్రీ రామస్వామిగారు

మనసు నచ్చునెడల మన్నింపగా వచ్చు
మనసు నొచ్చునెడల మానవచ్చుఁ
గాని, వివరమేమి కనకుండ వినకుండఁ
బరులఁ బ్రువ్వదిట్ట ఫలముగలదె?
అని మందలించింది!

పద్మనాభం : సరే! సూతపురాణమునందు మీరు పేర్కొనినవన్నియు కలవా?

సింహాద్రి : కవిరాజు వ్రాసింది సూతపురాణం ఒక్కటేనా?

కన్నకవి : మరింకేమి వ్రాసెనో....

నిరంజనం : ముచ్చటగా మూడు శతకాలు - కుప్పుసామి శతకము, ధూర్త మానవా శతకము, గోపాలరాయ శతకము.

దామోదరం : బ్రహ్మనాయని నోట పలికించిన భగవద్గీత వినలేదా?

అబ్బారావు అదిగొప్ప Parady అటకదా! అందులోని విభూతియోగం వింటే కృష్ణుడు జుట్టుపీక్కోవలసిందేనని జరుక్‌శాస్త్రి చెణుకు విసిరా రటకదా!

నిరంజనం కవిరాజు వ్రాసిన కారెంపూడి కదనం, కొండవీటి పతనం, రాణా ప్రతాప్ అనే నాటకాలు లభించనందుకు బాధగావుంది.

దామోదరం లభించినవి చదివితేచాలు - కురుక్షేత్ర సంగ్రామం, శంభుకవధ, ఖూనీ పేటికవే సాటిలేని మేటిరచనలు.

ధురంధరం అధ్యక్షా! మీరు సింహాద్రిగారిని మాట్లాడమన వీరెల్లరు మాట్లాడుచురేమి?

వివేకి అటుల విషయములు వివరింప ఎందరు మాట్లాడిన ఏమి?

కన్నకవి భావ విప్లవమును కోరిన కవిరాజు భాషా విప్లవమునకెందుకు వెరచినాడో?

దామోదరం వెరచికాదు. పండితులకు వారిభాషలోనే సమాధానము చెప్పాలనే పట్టుదల. ఆ మాత్రంతెలియదా కన్నకవిగారూ!

సింహాద్రి భాష విషయంలో కూడ కవిరాజు తిరుగుబాటు చేశాడుకదా. తెలుగువాళ్ళు సంస్కృత సమాలనీ, సంస్కృత భావాలనీ చేపట్టినంత మాత్రాన తెలుగు వికృతి అవుతుందా అని తిరగబడలేదూ?

నిరంజనం "అప్పటికి బహుళ ప్రచారములోనున్న యక్కరలను వన్నియ వాడినాడుకాని వానితత్వమెఱుంగ జాలక మధురగతి నంతయు మంటిపాలుచేసి కుంటినడక యంటించినాడు" అనిగేలిచేసి తెలుగు కవితకు క్రొత్త హొయలు సమకూర్చిన వారిలో కవిరాజు లేరా?

దామోదరం : దీర్ఘముల మీదియలు సున్నకు విందుసున్నా లేదన్న చిన్నయ్యసూరిని" ఏమయ్యా 'అంబోతు' 'గోంగూర' అలా మేస్తూంటే శూన్యంలోకి చూస్తావేమయ్యా అని వేళాకోళం చెయ్యలేదూ?

అప్పారావు : ఇంకావయలి - కవుజులో అరమున్న లేకపోతే దాని రుచి చెడిపోతుందనీ - దుకాణంలో ఉలవల డబ్బామీద అమ్మ 'ఉ' బిడులు

'వ'కు కొమ్మిస్తే 'వు' రాసివుంటే ఆ ఉలవలు ఎడ్లుతినవనీ అన్నారుకాదు!

నిరంజనం  అయినా కవిరాజు మీ కవులమాదిరి మడిగట్టుకు కూర్చుంటే వీరగంధమెలా పంచేవాడు? మేలుకొలుపు లెలా పాడేవాడు?

దామోదరం : ఆయన క్షామాన్ని వర్ణించినా సమాజ క్షేమాన్ని వివరించినా దేని ప్రత్యేకత దానిదే

నిరంజనం : నందగోష్ఠాములను వర్ణించినా, నందనవనాల్ని సృజించినా ఆ అందమే అందం.

సింహాద్రి : మొత్తుకోళ్ళని చెప్పి నెత్తిన మొత్తినా, జోతలని జోరుగా వాతలుబెట్టినా వాటిదారేవేరు.

నిరంజనం : పిట్టకథలకు పుట్టినిండ్లయిన పురాణాల్ని పునాదులతో సైతం పెకలించి వేసాడు.

దామోదరం  ధూర్తమానవుడిపై దైవం ఎంతగా ధ్వజంఎత్తేట్లు చేసాడో

నిరంజనం  కుప్పుసామి శతకంలో హితబోధలు కుప్పలు తెప్పలు

అబ్బారావు  వివాహవిధిని కూడ అందించారటకదా.

కన్నకవి : అవునవును నీకిప్పుడు విధిగా చెయ్యాలి పెళ్ళి!

అబ్బారావు : అది మీకెప్పుడో అయ్యిందిగా మాష్టారూ!

పద్మనాభం : అదిసరే. మీరుటంకించిన విషయములన్నియు ఆయన వ్రాసిన ఏ పుస్తకములో లభించునో సింహాద్రిగారు.

అబ్బారావు : దానికి సింహాద్రిగారిదాకా ఎందుకండీ. సన్నడిగితే నేనుచెప్పనూ, గుంటూరులో కవిరాజు సాహితీసమితి వారు 'కవిరాజమార్గము' ప్రచురించారు. అందులో అవన్నీవున్నాయి.

కన్నకవి : [వెటకారంగా] అవునులే, అవన్నీ నీకు బాగా అర్థమయి ఉంటాయిలే.

పద్మనాభం : ఏదోపాపం పసివాడు. నల్వురిలో పరువుతీయకు

అబ్బారావు : పరువు విషయమూ వుంది అందులో? వింటారా!

ఇతరుల బర్వుతో బ్రదుకనిచ్చుట నెన్నఁడు నేర్చికొందు వా
యతమగు నీ ప్రపంచ సుఖమన్నది యొక్కటె నీ సుఖంబుగాఁ
బ్రతిదినమున్ స్మరించు సమభావము నెన్నడు నేర్చికొందు వు
న్నతిఁ గనుచుండి నీ ప్రజ లనారతమున్ నిను మెచ్చ మానవా!

కనుక పరువు ప్రతిష్ఠల విషయాన్ని లావదలి "కవిరాజమార్గము"ను పాఠ్యగ్రంథముగా నిర్ణయించుట తీర్మానమును ఆమోదించవలసినదిగా కోరుచున్నాను.

దామోదరం : నేనా ప్రతిపాదనను సమర్థిస్తున్నాను

నిరంజనం : నేను అంగీకారము తెలియజేయుచున్నాను.

కన్నకవి : మేమంగీకరించము.

సింహాద్రి : ఓహో! అంగీకరించరా? చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారి కంటే గొప్పవారా తమరు!

కన్నకవి : ఇప్పుడాయన ప్రస్తావనయేల?

దామోదరం : ఏలయందురా! వారిమాటలే వినండి.

జాతిద్వేషము అల్పబుద్ధులయెడన్ సాహిత్యకృతిన్ జూపు, వి
ద్యాతత్త్వజ్ఞుల భట్టుమూర్తికి యథార్హస్థానమీలేదె? ఆ
ప్రీతిన్ బట్టి కులాభిమానమునకున్ విశ్వాత్తనున్ దూరమం
చేతో చున్; గుణమున్న మెచ్చుటయె వాసిన్ దెచ్చు నెవ్వారికిన్.

ధురంధరం : అల నన్నయ్యకు తిక్కనకు లేని మహాభాగ్యము తన శిష్యరికము వలన చెళ్ళపిళ్ళ వారికి దక్కినదని చెప్పిన మాటలు వింటిమిగాని రామస్వామి తన గురువులగూర్చి అటుల చెప్పినట్లు వినలేదే!

సింహాద్రి : కానీ చెళ్ళపిళ్ళవారే ఆర్ద్రతతో చెప్పిన ఈ పద్యం వినండి.

రామస్వామి కవిత్వతత్త్వఖని, "బారట్లా", కులీనుండు, వి
ద్యామాన్యుండు; శిశుత్వమాది తన ప్రాయంబెల్ల నక్కైక తకే
నేమించెన్; ప్రకృతంపుఁ బేరిమికి నానేమంబె ముఖ్యంబు, న
న్నే మానించినయట్లు సంతసిలి నేనీఆశిషంబిచ్చితిన్.

అబ్బారావు : అంతేకాదు.

సూతపురాణ కల్పనకు సూరు లసూయకు గొంత లోగియున్
జేతమునందు మెత్తు రని చెప్పుదు సందియ మంద లేశమున్

అనికూడా అన్నారుకదా-

కన్నకవి : అటులయిన తిరుపతి వేంకటకవుల మాటలకు మే మెదురాడము ఆయన మాటలను మేమవుదలదాల్తుము.

సింహాద్రి : [ధురంధరం, పద్మనాభంల వంకజూచి] మీరేమందురు.

ధురంధరం : }
పద్మనాభం : } అనుటకేమున్నది? చెళ్ళపిళ్ళవారి మాటకదా. మాకును శిరోధార్యమే.

అబ్బారావు : ఎట్టకేలకు గురువులు రాజమార్గము - అదే కవిరాజ మార్గము పట్టిరి. పట్టకేమిచేతురు. నిజమునకు కవిరాజు-

పరుల మెప్పుగోరి పాటుపడ్డది లేదు
స్వార్థమునకుఁ గేలు సాపలేదు
గొప్పతనము సూచి కోడయి కూసిన
జగముమాత్ర మింత సాక్ష్యమిచ్చు.

వివేకి : మీ యభిప్రాయమేమి మల్లీశ్వరిగారూ?

మల్లీశ్వరి : ఒక్క భగవద్భక్తి విషయమున సందేహించుచున్నానుగాని చదువు కొన్న భార్య సంసారమును దిద్దునన్న మహనీయునికి జేజేలు పలుకకుండ ఎట్లుండగలను.

వివేకి : సభ్యుల యభిప్రాయముల కనుగుణముగా "కవిరాజమార్గము"ను సిఫారసు చేయుటకు ఆమోదించడమైనది.

[సభ్యులందరూ నిలుచుండగా]

[నేపథ్యంలోనుండి]

హేతువాద కవిత కితడే ఆద్యుడు!
భావ విప్లవ ప్రవక్త యితడె!
నవయుగోదయమ్మునకు నాంది పల్కిన
రవి నిభుండగు కవిరాజితండె!

[సభ్యులందరు నిష్క్రమింతురు]



ఉన్నది యున్నయట్టు లనుచున్నెడ లోకము తల్లక్రిందు లౌ
చున్నను జంక వాకలముకున్న స్వతంత్రతయా స్వభావ మం
దున్న వినిశ్చయం బెవరి కున్నది! హెచ్చులకేమి? నీవలెనన్
అన్నిటం బోటికై బ్రదికినప్పటి మాటకదా! మహాకవీ!

*　　　*　　　*

ఎన్ని జన్మలెత్తి యీ సిద్ధహస్తుని
కవితలోనం జేయి కలుపగలము!

—కవిబ్రహ్మ

నన్నయ్యలందునా నశియింపగానీరు
　　తీరుతీయములొందు తెలుగుసొంపు
తిక్కన్నలందునా తీరిపమెత్తగబోరు
　　భావబీజములకు వ్యాసబుషిని
సోమన్నలందునా సొంపుతగ్గదుగదా
　　యితరుపక్షమ్ముననందేనిగాని
సూరన్నలందునా సొగసువీడదుగదా
　　పద్దెంపు గట్టులో పనితనమ్ము
రామకృష్ణులే యందునా వ్రాతలోన
కనము పరిహాస రేఖావికాసమెచట

....　　....　　....　　....

....　　....　　....　　....

ఓ కవిరాజా! నీదా కృతి
కే కృతియును దెల్గులోన నీడుంజోడున్
నాకగపట్టదు నవ్వర
సాకృతులీనిన్న వందు నతిశయమున్నే!

—డా॥ జి.వి. కృష్ణరావు

# నలగని దారి

సాహిత్యము బహుళార్థకము సమాజములో వ్యక్తులమధ్య అవగాహన పెంచుట, కృషిని సమన్వయము చేయుట, గుణదోషములను నిర్దేశించుట, సుగుణములను పెంచుట, దోషములను తుంచుట, పద్ధతులను, మర్యాదలను స్థిరపరుచుట, ఆదర్శములను, ఆదర్శమూర్తులను రూపొందించుట, స్వాభిమానమును, స్వావలంబనమును పెంపొందించుట మొదలగునవి సాహిత్యపు ప్రయోజనములు.

పురాణములు, ఇతిహాసములు, ప్రబంధములు, గీతలు, సూక్తులు ఇతర మత గ్రంథములు ఇందుకు భిన్నము, దూరము. దైవమునకు పరిపాలక వర్గమునకు కవిపండిత వర్గమునకు ఇతర మానవావళిని దాసదాసీలుగా చేయు పరికరముగా సాహిత్యమును రూపొందించిరి.

వాల్టేరు వంటి ప్రముఖులు దూరదృష్టితో వారి కాలమునాటి మతసాహిత్యములలోని దోషములను దుయ్యబట్టి సమాజమునకు ఎనలేని సేవచేసిరి. తెలుగు సాహిత్యములో అటువంటి కృషిసల్పినవాడు త్రిపురనేని రామస్వామిగారు. అంతేగాదు మానవులను దాసదాసీలుగా చేయుటకు రూపొందింపబడిన సాహిత్యమును తూర్పారపట్టినాడు. సమాజమును సన్మార్గములో నడిపించగల సాహిత్యమును సృజియించుట కవిరాజు ప్రత్యేకత, విశిష్టత.

రాజ్యాధికారమును చేజిక్కించుకొనుటకు ధన, మాన, ప్రాణములను ఒడ్డిన పరిపాలకులు, తరువాత పరుల ధన, మాన, ప్రాణములను వెచ్చించి తమ సుఖసంతోషములను కీర్తి ప్రతిష్ఠలను హెచ్చించుకొనుట కొఱకేగదా! రాజ్యాధికారపు సాగుబడికి పనిముట్టు ఖడ్గము; చేదోడు ఖడ్గధారులు; కొరముట్టు. గంటము; వాదోడు కవిపండితులు. రెండువైపులా పదును కల్గినను ఖడ్గపు ఆధిపత్యము తాత్కాలికము. కాలము, దూరము పెరిగినకొలది అది అదే నిష్కృత్తిలో తరగును.

కల్గినది మొనమాత్రమే అయినను వ్రాయునది తాటియాకులమీదనే అయినను గంటపు ఆధిపత్యము కాలము దూరము పెరిగినకొలది పెరిగినది. కవులు, పండితులు తమను పోషించు పరిపాలకులు వారి పూర్వుల సుగుణములను పెంచి పెంచి కొండంతలుగాను దోషములను కుదించి కుదించి గోరంతలుగా సాహిత్యము వ్రాసిరి. నమ్మిన పాలితులు కొండంత సుగుణములను సాధించలేక వంశానుగతమైన గొప్పలకు నోచుకోలేక, గోరంతలుగా చేయబడి అందుబాటులో ఉన్న పరిపాలకుల దోషములను అనుకరించిరి. "యథారాజా తథాప్రజా"! ఈ సాహిత్యము వలన కలిగిన ఫలితము సంఘములో సుగుణములు తరుగుట దోషములు పెరుగుట.

మన సాహిత్యములో ప్రధానమైనవి అపౌరుషేయములు. అవి కవిపండితులకు వారి వారసులకు కాలగతిలో మారని మారకూడని సత్యములు. వాని ప్రకారము జనులకు కల్గెడి కష్టనష్టములు భగవంతుని లీలలు. ఓర్పుట ముక్తి మార్గము. మన కవి పండితులు సుఖంగా ఉండుటయే "సర్వేజనా సుఖినో భవంతు". కాలగతిలో సామాన్యుడికి కల్గెడి బాధలు కవి పండితులకు వారి వారసులుకు కూడా కలిగినవి. తమదాకా కష్టము వచ్చినపుడు వారికి కూడా నొప్పి తెలియవచ్చినది. సంస్కరణ ఒప్పుకొనిరి. సతీసహగమనము మూలధర్మమునకు విరుద్ధమనిరి. వితంతు వివాహము కూడ ధర్మబద్ధమేననిరి. చదువులకు, వేదములకు దూరముగా నుంచబడినవారు క్రైస్తవ మహమ్మదీయ మతములలో చేరుట చూచి హిందూమతరక్షణ కొరకు వెలసినది ఆర్యసమాజము. చదువులకు వేదములకు అందరూ అర్హులే అని ఎలుగెత్తి చాటినది. ఈ మార్పులన్ని ఆపద మొక్కులుగా, ప్రథమ చికిత్సలుగా, తాత్కాలిక ఉపశమనము గావించినవేమో గాని రోగ నిధానము చేయలేక పోయినవి.

దుష్టులైన పరిపాలకులు మరణించినపుడు పాలితులకు వారి పీడ విరగడ అగును. సాహిత్యము వ్యక్తులవలె మరణించునదికాదు. కాలముతో పెరుగునది. పది నీతులు పది బూతులు కలయికగా వ్రాయబడిన మన అపౌరుషేయములు కాలక్రమాన పెరిగి పెరిగి ఆరునీతులకు వేయారు బూతులకు నెలవైనవి. ఇట్టి గ్రంథ పంకప్రక్షాళన కార్యక్రమమునకు నాంది కవిరాజుగారి కురుక్షేత్ర సంగ్రామము. పరాకాష్ఠ సూతపురాణము, పరిపూర్ణము పలనాటి భగవద్గీత.

'జయాపజయములు దైవాధీనములు' 'సత్యమేవజయతే'. అనునవి ఆర్యోక్తులు. అనగా జయించినవాడు సత్యవంతుడు న్యాయశీలి. ఓడినవాడు అసత్యుడు. అన్యాయవాది. కనుక పోరులోను, ఎన్నికలలోను గెల్చే వారెవరో తెలిసికొని కోపుకాయవలయును. గెల్చినవారి వైపుకు మారవలయును. ఈ పద్ధతిలోనే ఎక్కువమంది నడచుచున్నారు. కవియైనవాడు జయించిన వానిని పొగుడుతూ ఓడినవానిని తెగడుతూ వ్రాయవలయును. మనపురాణములు ఇతిహాసములు వ్రాయబడిన తీరు యిదే. ఇందుకు భిన్నముగా ఋజువర్తనులై, సత్యవంతులై వంచించబడి ఓడినవారిని వెన్నుగాచి కుటిలకపట పద్ధతులలో గెల్చినవారిని అపహాస్యముచేసిన సత్యవ్రతుడు, నీతిప్రియుడు కవిరాజు.

దేవతా వందికోటి వ్రాసిపెట్టిన పక్షపాత భూయిష్ఠమైన పాఠములకు ఆయన చెప్పిన పాఠ్యాంతరమిదిగో చూడుడు.

గెల్పోటములనొక పోల్చున జూచిన వృత్రాసురుడు తత్త్వవేత్తకాడె
రణ నీతిబద్ధుడై ప్రాణముల్ వ్రాసిన స్వర్ణనేత్రుండు నీతిశాలికాడె?
కాపట్యమెఱిగియు గాశ్యపినిచ్చిన బలిదైత్యుడు వదాన్యవరుడుకాడె?
సమధీశకీద విజ్ఞాన ధనుండైన విశ్వరూపుడు వేదవేత్తకాడె?

న్యాయమగునె వైతండికులాడు మాట
పాటిసేయుట .... .... .... .... ....
పక్షపాత భూయిష్ఠమౌ పాఠములను
వ్రాసిపెట్టెను దేవతా వందికోటి.

ఋజువు అడిగే గుణము హిరణ్యకశిపుడుది. అదే శాస్త్రకారుల గుణము కూడ. న్యాయస్థానములలో ఋజువు అడుగుట ఆనవాయితి. ఋజువు కానిది నిజముకాదు. ఋజువులేకుండ చేయు ఆలోచన, ఆచరణ సత్ఫలితముల నివ్వజాలవు. ఋజువు అడిగినచో ఆగ్రహించెడి నీచ నరుడివలె నారాయణుడు కూడ ఉగ్రనరసింహావతారమెత్తి వధించుట ఏల? ఋజుమార్గము వైపు లోకమును నడిపింపవలసిన సాహిత్యములో ఇట్టి పురాణగాథలు కలుపు మొక్కలు కావా?

నిజాతిన్ గోమేధంబంట
హయమేధమట నరమేధమట చేతురటే
దయామాలి స్వార్థపరులై
వ్యయ ప్రయాసములు లేక యార్యమునీంద్రుల్.

తాటకి యిట్టి యజ్ఞములకు అంతరాయము కల్గించినది. దయార్ద్రహృదయ. మన పౌరాణికములు ఆమెను గౌరవించుట నేర్వక, నేర్పక, నరబలి కోరు కాళికకు పూజలుచేయుట నేర్పిరి. ఇదేమి విడ్డూరమని పలుకు రామస్వామిగారి మనసెరిగి, వారి మార్గమున పయనించుటకు మన పండితులు పామరులు ఎంత కృషి సలుపవలసి యున్నదో.

చుప్పనాక ముదుసలి. వితంతువు. ఆమె ఏకైక కుమారుడు జంబు కుమారుడు. తపోధనుడు. అతనిని లక్ష్మణుడు వధచేసెను. ఇట్టిఅకార్యము చేసిన లక్ష్మణుని పుణ్యపురుషుడని కొనియాడు సాహిత్యము వృద్ధియగుచోట ధర్మ క్షయముగాక మరేమి జరుగును.

రామాయణ మందలి వివరణల ఆధారముగా "రావన" కోయరాజని తలచిరి త్రిపురనేనివారు. "రావ" యను కోయమాటకు పుంలింగద్యోతకముగా దక్షిణదేశమున నేటికిని వాడుకలోయున్న "అన్న" యను శబ్దము జోడించిన రావన యగుననిరి. దసగీవకూడ కోయభాషా శబ్దమే. అర్థము శత్రుభయము లేనివాడు. అట్టివానికి పదితలలు తగిలించిరి. ఇటుల పేరులు మార్చి మంచివారిని చెడ్డవారిగా చిత్రించిన కవుల గంటముల ముక్కులు విరుగగొట్టినవాడు కవిరాజు.

నాభి మీదను వాలమ్ము నాటు పుడమి
వాల్చె డబ్బాటుతోడ రావణ నరేంద్రు
భాగవతుడో విభీషణాను పల్కువినుచు
ధర్మమో? అధర్మమో? పనిమాత్రము తీరె.

ఇట్టిపనుల చేసిన రాముని పుణ్యపురుషుడని, లోకకళ్యాణ ప్రదాతయని, పూజింప వలయునని చెప్పుట విడ్డూరముకాదా? పని తీరుటకు ధర్మమొ,

అధర్మమో, అని చింతన చేయవలసిన పనిలేదని చెప్పలేకదా! అటులయిన చెడు పెరిగి మంచితరుగ కింకేమి జరుగును?

సోదరప్రేమ దొడ్డది. దానిని ఆదర్శప్రాయులు హంసడిచికులు. వారు నియమపరులు, శక్తిపరులు. మాయ తలపనివారు. మాయ తెలియనివారు. అయిన నేమి మాయోపాయమునకు బలియైరి. అట్టివారి గుణములను కొనియాడుట, వానిని లోకమున పెంచుట, శుభకరమే గాక సత్కవుల తక్షణ కర్తవ్యముకూడ.

"వీరత్రయంబు చేయుకో త్తలకు నిలువంజాలక
తలచీరలూడ యాదవ సైన్యంబు క్రేణ్ణిక చుండగాంచి
శ్రీకృష్ణుండు సైన్యరక్షణంబవశ్య కర్తవ్యమని నిశ్చయించి.
డెప్పరముగ నొక్కచోట పోరు డిచకు కడకు
వార్తబుత్తెంచె హంసుడు ప్రధన భూమి
నీల్గెనని దీనినాలించి యెన్నరాని
శోకమున మున్గి డిచకుండు శూరుడయ్యు
అన్నలేని రాజ్యం బేల? యూము నేల?
భోగభాగ్యంబులవియేల? భూము లేల?
యంచు మిక్కిలి వగ చేత నోరు గఅది
గంగలో దూకి ప్రాణము గంగ కలిపె.
తమ్ముడు రంగంలో దుమికి తౌమరణించెనన్న వార్త శో
కమ్ము గూర్పగా నడలి గ్రక్కు దమ్ముడు లేని రాజ్యమున్
దమ్ముడులేని వైభవము తమ్ముడులేని సుఖంబేల? నా
తమ్ముహి నంచు గంగబడి యాల్గెను హంసుడు ధీరచిత్తుడై.

రామలక్ష్మణుల భాతృప్రేమ వారిప్రక్కన వెలతెలబోదా? వాలి సుగ్రీవు. లనేమనవలె? అనుటకేమున్నది. విభీషణుని గౌరవించుట నేర్పిన మత్తు సాహిత్యము మనది. గమ్మత్తు సాహిత్యము మనది.

ఏకలవ్యునకు మరోపేరు శత్రుఘ్నుడు. అతని శరలాఘవము అద్వితీయము. ఒక తూరి చూచిన కిరీటి—

"ముక్కంటి నెక్కటి కయ్యమున గెల్చిన" కిరీటి విక్కమొగము పెట్టె. గురువునొద్దకు చేరి మొరపెట్టె. గురుశిష్యులు ఏకలవ్యుని చూడబోయిరి. అతడు ఛిన్నమైనరేడు. ఆత్మరక్షణకు భటులు అవసరములేదు. వారికవాతులు లేవు. భటులు పోయి పరులసొమ్ము కొల్లగొట్టుటలేదు. సొమ్ము తెచ్చుటకు బండ్లులేవు. బండ్లను కాపాడ వెంబడించు రథములులేవు. రథములు తిరుగ విశాలమైన వీధులు లేవు.

రాచస్త్రీలులేరు, అంతఃపురములులేవు, అంతఃపుర రహస్యములు లేవు. కనుక రహస్యములను దాచ ప్రాకారములులేవు. ప్రాకారములు దాటి వచ్చు రాకొమరులకు స్వాగతములు చెప్పు రాచకన్యలు లేరు. దాటుటకు అగడ్తలును లేవు.

ఉడుగరలు స్వీకరించుటలేదు. మెరమెచ్చులులేవు. అందులకై నిండుసభలు లేవు. ఆడితప్పుటలేదు. తప్పినమాట శాస్త్ర సమ్మతమని వేదార్థములు చెప్పు వైదికులులేరు. పాడితప్పుటలేదు. తప్పుట మేపాడియను చెప్పు తార్కికులులేరు. సోమరితనములేదు. పర్యవసానమైన రాచపుండ్లులేవు. రాచవైద్యులులేరు. పరార్థమేదో స్వార్థమేదో తేటపడకుండ నానార్థములు చెప్పు నైఘంటికులులేరు. షడ్రసోపేతమైన భోజనములులేవు.

దొంగతోడుబోతులులేరు. శిక్షవిధించు నవసరములేదు. ఒకపని తాను చేసినప్పుడు గుణమని, పరులుచేసిన దోషమని పలుకుటలేదు. ఆత్మవంచనలేదు. అంతర్వాణి ఎదురుతిరుగుటలేదు. ఆ కారణముగ ఉక్కదీయుటలేదు. తగ్గుటకు వింజామరములు వీచుటలేదు. కూసగ్రుడ్డి కుంటి,రోగి,వారసత్వమున రాజగుటలేదు. పాడు పడకుండ పదిలముచేయు పెద్ద ఆసనములులేవు. అలంకార ప్రాయులులేరు. అలంకారములులేవు. విశిష్టము కదా ఏకలవ్యుని రాచరికము.

అట్టివాని చూచినంతనే చాప గురుని చేవచచ్చె. అతిథి సత్కారములు పొంది వృత్తాంతమెల్ల తెలిసికొనిరి. శుద్ధాంతరంగుడైన గురుడెవరైనా ఏకలవ్యునికి స్వయముగా విద్యనేర్పలేక పోయినందులకే కుంచెడువాడు. తనను

గురువుగా భావించి ఆరాధించిన తీరుకు పరమానందభరితుడయ్యేడువాడు. కాని ద్రోణుని ప్రవృత్తివేరు. అది విషభరితమైనది, కుటిలమైనది. దురాచారముచూపి విద్యార్థిని తిరస్కరించినందుకు చింతించదు. చింతించకపోగా యాచనలో కూడా ఎంత వంచన? దురాలోచనచేసి దూరాలోచన గావించి గురుదక్షిణ పేర బొటన వ్రేలడిగినాడు. దొడ్డవారు దొడ్డిదారిన బడుట నేర్పినాడు.

శూరుడు ఏకలవ్యుడు-తన జీవితశ్రేయముగా సాధించిన విద్య తనను, తన వారిని రక్షించు విద్య పోవునని తెలిసికూడ బొటనవ్రేలు నిచ్చినాడు. కార్యశూరుడు సిగ్గుదాచి చేయిసాచినాడు. శూరుడు బొటనవ్రేలిని త్రుంపి అందించినాడు. లోకమున

శూరులు వేరు — కార్యశూరులు వేరు
పాపలు వేరు — కాటిపాపలు వేరు.

ప్రకటితమైన, ప్రకాశమైన, సచ్ఛీలమును ప్రచ్ఛన్నముగా దుశ్శీలము బలిగొన్న దుష్ట సన్నివేశము ఇది. యుగయుగములనుండి ఆచారముల పేర అత్యాచారములు జరుగుచున్నవి. కలియుగమున పెచ్చరిల్లునని కదా వారు చెప్పినది. ఎల్లరూ గుడ్లప్పచెప్పి చూచుచుందురేగాని నోరువిప్పి మాటలాడినది లేదు. సభికులు శిశుపాలుని కాలమునుండి నేటివరకు

"గుసగుసలాడుటేగాని బిసవిడి మాటాడరిందు
బిఱికితనము"నే ప్రకటించుచుండిరి.

కృష్ణుడు మాయావి. కంసుని, జరాసంధుని, హంసడిచకులను శిశుపాలుని హేయమైన రీతిన హతమార్చినాడు. దుర్యోధనుని తొడలు విరుగ గొట్టించినాడు. అధర్మరణము చేయించినాడు. పాండవులను కీలుబొమ్మలుగా ఆడించినాడు.

ఇంటి దాసియైన త్రివక్ర ఇంటికేగి
ప్రేమతో ఆమెతో ఒకరేయి గడిపి

ఖలసంయోగమటంచు దానెఱింగియున్ గార్యార్థి శ్రీకృష్ణుడా
కులపాటు గనకుంచ దాసియను సంకోచంబు లేకుండ బు
వ్వుల సెజ్జన్ గఱగించె గుబ్జను.
కార్యార్థులకు నేటికి నీ శ్రీకృష్ణుడు మార్గదర్శి!
ధర్మము, నీతి, నియమములను తమవైపుకు త్రిప్పుకుందురు.

బాధితుడు, బలహీనుడు; బాధించువాడు, బలవంతుడు, బాధించువాడు లాగికొన్న ద్రవ్యమును పరులకు పంచును. బలమును నిలుపుకొనును. పెంచుకొనును. బాధితుడు ఏకాకియై ధనహీనుడుగను, బాధాగ్రస్తుడుగను మారును. బాధితుడు బాదించువానిని అడ్డుకొనిన తగవగును. అది తాత్కాలికము నిష్ప్రయోజనకరము పోరుగా నిలువదు. రణముగా రూపొందదు. బలవంతుల మధ్య రాజ్యము కొఱకు, రమకొఱకు పోరువచ్చును. రణముగా రూపొందును. రమ, రాజ్యము కొఱకు రణము చేయునది శత్రువులేకాదు భాత్రులుకూడా! ఇతిహాసములు తిరగవేసినచో తండ్రీకొడుకులు కూడా తటస్థపడుదురు.

మన ఇతిహాసములలో రమకొఱకు పోరిన సోదరులు వాలి సుగ్రీవులు. సుందోపసందులు. స్వయంవరపు పందిళ్ళు యుద్ధరంగములుగా మారినవికదా? రాజ్యము కొఱకు పోరిన సోదరులు పల్నాటిలో సవతి సైదోడులు. ఉత్తరాదిన కురుపాండవులు. రాజసూయములు, దండయాత్రలు బలవంతుల, తిన, కుడువ, నిలువ, ఆనందింప సదుపాయములు కలవారి పేరాసల పర్యవసానములు, అసూయాజనితములు జుగుప్సాజనకములు.

రణములో తమపక్షము గెల్చినను సుఖములుపొంద మిగిలియుండు వారు బహుస్వల్పము. హతులు, హతాశయులు మెండు. అంతేకాదు అంతులేని అమాయకులకు అపకారము అపాయము అపారము.

రణమును గురించి రామస్వామిగారి మొదటి పద్యము

ఆముపెద్దులు రెండు పోరాడుచుండ
నడుమనున్న లేగల కాళ్లు నలుగునట్లు
పుడమికై కురుపాండవుల్ పోరుసలుప
నొరులు చచ్చినారిటునటు తిరుగలేక.

పనిచేయక తిని తిరుగు భాగ్యము బలము కలిగినది. ఆముపెద్దులు ఒకటి పరియొకటి మనియుంట సహించవు. కలుగచేసికొని కయ్యమునకు కాలుదువ్వును. కయ్యమున కలుగజేసికొనని లేగదూడల కాళ్ళు అందు పటపట విరుగును కదా! రణము వచ్చు కారణమునకు పర్యవసానమునకు సరియగు వుపమానము ఇచ్చినాడు. వర్ణనము గావించినాడు.

భారతదేశమున బహుకాలముగ బహుళ గౌరవము పొందినది వర్ణాశ్రమ ధర్మము. ఇది "వర్ణాశ్రయ ధర్మము" కూడా. వీని నియమముల ననుసంచిరి

భూమిపై బ్రతికినవారు వీరి నమ్మకము ప్రకారము స్వర్గలోకమునకు రణము లేనప్పుడు చేరటము; రణము వచ్చిన తరువాత చేరటము; అద్దముపట్టి చూపిన సన్నివేశము కురుక్షేత్ర సంగ్రామములో నారాయణశాస్త్రి ప్రహసనము.

వర్ణాశ్రమ ధర్మప్రకారము శూద్రుని జన్మ పాపము. అనగా తెలిసి ఆలోచించి చేసిన దోషము. బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులలో నొక్కనిగా పుట్టనివాడుమనుజుడుగా పరిగణింపబడడు.సత్కార్యములు చేయరాదు.చదువరాదు. ధనము ప్రోగుచేయరాదు. అధికారము పొందరాదు. దాస్యము చేయవలెను. జన్మరాహిత్యము పొందుటకు, స్వర్గలోకము చేరుటకు అవసరమని చెప్పబడు జప, తపములు చేయరాదు. ఐతే ఏమిచేయవలయును? ఒౌను విరుగుడు ఉన్నది.

అదే వీరమరణము పొందుట. అనగా చంపబోయి చంపబడటము.

చంపబోవుటకు గ్రాసము దొరుకును. చచ్చిన స్వర్గముదొరకును.

బంటికైవాడు, కోయిలకంఠెవాడు
బోడితలవాడు, ముదికోతి మొగమువాడు
కుంటివాడు, ఎగుడువిగుడు పంటివాడు - అయిన శూద్రుడు

రణములో పాల్గొని చంపలేక చచ్చి స్వర్గముచేరెను. నారాయణశాస్త్రి సుఖములు మాని, అన్నమైన తినక గాలిమేసి అనేకయజ్ఞములు చేసి స్వర్గము చేరెను. భూలోకములో తనను ముట్టగూడనివాడు దాస్యము చేయవలసినవాడు స్వర్గమునుండి రంభసాన్నిధ్యమునుండి భూలోకమునకు దిగనెట్టగా పడిపోయెను.

రణములో పాల్గొనజేయుటకు ఇంతకన్నా ఎక్కుడు ఏమిచెప్పగలరు. కూలికి విషము త్రాగుటను ఎంత గొప్పచేసిరి? మాటలమూటలు ఎంతటి బూటకములు చేయగల్గును. అఘటనఘటనా సమర్థులుకదా! మన ముని ప్రతతి. వారి బూటకమును అరవిప్పి తెరతీసి చూపి మానవులకు సత్యమార్గమును సన్మార్గమును ఆవిష్కరింప చేసినవారు త్రిపురనేని రామస్వామిగారు.

యుద్ధము మధ్యలో - అందరూ వెఱ్ఱిగా, ఆవేశముగా యున్నప్పుడు - విక్లబుద్ధైన అర్జునునితో కృష్ణుడు చెప్పినది చాతుర్వర్ణ్యం మయాసృష్టం. గుణకర్మ విభాగశః,

అనగా ఒక వర్ణములో ఒకని గుణకర్మలు మనకు తెలియుటే మిగతా వారి గుణకర్మలుకూడ తెలిసినట్లే - అందరివి ఒకే రకముకదా! ఒక వంశమువారి గుణకర్మలు మరింతగా ఒకేమూసలో పోసియుంటవి. ఒకకుటుంబము వారివియైతే మరీను - కవలలను చూసి క్రొత్తవారు తేడా చెప్పలేనట్లు వీరిలో తేడా చెప్పటము కష్టము. క్లిష్టము.

వర్ణాశ్రమ ధర్మము ప్రకారము క్షత్రియులైన కురుపాండవులు ఒకేరకమైన గుణము కలవారై యుంటారు. ఇరువాగులు వారును మంచివారైతే రాజ్యము పంపకములో విరోధమురాదు. ఇద్దరు చెడ్డవారైతే యుద్ధము అధర్మము. పరమ పురుషుడు కృష్ణుడు ఒకరి తట్టు ఉండడు. ఋషిపుంగవుడు వ్యాసుడు వ్రాయడు. పుణ్యాత్ములు పౌరాణికులు ప్రచారము చేయరు. పుణ్యార్తులు భక్తులు వినరు విధిగా ఒకవైపువారు సుగుణసంపన్నులు. తద్వ్యతిరేకులు, దోషులు. గుణకర్మ విభాగమైన వర్ణములు అప్పటికే - కురుపాండవ యుద్ధమునకు ముందే సంకరమై పోయియుండును. వర్ణములు ఎంతో భ్రష్టపట్టే కృష్ణుని మేనమామ దుష్టుడయ్యెను!

ధర్మదూరులు పెరుగుట భూభారమని వారిని పరిమార్చిన భూభారము తగ్గునని అందులకు రణమే యుచితమగు మార్గమని చెప్పువారు ధర్మపరులని వినువారి నమ్మకము. చెప్పువాడు శ్రీకృష్ణుడు. కురుక్షేత్ర యుద్ధమున సహాయము కోరుటకు అర్జునుడు, సుయోధనుడు, కృష్ణునివద్దకు పోయిరి. తనను ఒకపాలుగా అర్జునివైపు పోవుచు సైన్యమును ఒకపాలుగా పంచి సుయోధనునకు ఇచ్చిన కారణమేమి? తనకొరకు, తన ఆజ్ఞానుసారము ప్రాణములు ఇచ్చువారికి రక్షణా? మరణశాసనమా? లీలామానుషునకు తెలియదా? తెలుసు ఇంతకు మించిన దుర్మార్గముండగలదా? ఇది పాపముకాదా? ఇట్టివారు భూభారముకాదా? కురుక్షేత్ర యుద్ధము వీని ఆయువుతీసి భూభారము తగ్గించలేదుకదా? అమాయకులు ఆజ్ఞాపాలితులయిన ఈతని సైనికులను పరలోకమునకు పంపినదిగదా?

కనుక ఇటువంటి పురాణములు వ్రాయువారు ధర్మదూరులు, చెప్పువారూ ధర్మదూరులే. నమ్మించువారు ధర్మదూరులు. వీరందరు భూభారము పెంచువారు. ఇప్పుడు చెప్పుడు భూభారము తగ్గవలయుననిన ఏమిచేయవలయునో!

మానవునకు యవ్వనదశ ముఖ్యమైనది. అది సంసారమును వృద్ధిచేయునది సంరక్షించునది; పరిరక్షించునది. రణము యవ్వనపు పురుషులను బలికొనునది. ముదుసలి, పిల్లలు, స్త్రీలను దిక్కులేని వారిగా చేయునది. దురాచారములకు లోనుచేయునది. ఇట్టి రణమును సమర్థించువారు ఏ పేరుమీద చేసినను ఉన్మత్తులే.

రణము ఆదిన అధర్మము

రణము మధ్యన అధర్మము

రణము అంతమునను అధర్మమే.

కనుక మంచి జబ్బులు లేనట్లే ధర్మయుద్ధములకు తావులేదు. రణమును అనేక కోణములనుండి విశ్లేషించి బాలచంద్రుడు మౌలికమైన ప్రశ్నలు వేసినాడు.

ఒకటి దుండగులై గోరంతలు
కొండంతలుగా జేసికొని రెండు తెగల్
ఖండన యత్నము చేయు .... ....
ట - ధర్మమా? అవసరమా?

రెండు "రండని కబురంప"
యుద్ధముతో పాల్గొనవచ్చువారు
వివేకులా

మూడు వ్యాఘ్రములు రెండు సారంగి నాహరింప
నెంచి పోరాడు కొనుచుండ మృగయుడొక్క
డొక్క పులిడొక విదళించి యొక్కదాని
కేల తోడ్పడవలయునో?

ఈ ప్రశ్న వేసికొనక యుద్ధములో పాల్గొని పరులను చంపియో, చంపకో చచ్చువారు మూర్ఖులుకారా?

రాజులు రాకుమారులు రాజ్యమును
"పాళ్ళు .... .... .... .... బంచికొన
రాదే యన్నదమ్ములా తులారణము చేసి .... .... "

సమరాజు మార్గములో యుద్ధమును విశ్లేషించి, ఖండించవలసిన అవసరము నేడు చాలా యున్నది.

చాలామంది రాజ్యాధినేతల ఆధీనములో అణు మారణాయుధములున్నవి వారు మదమత్సరగ్రస్తులు. జుగుప్సాపరులు. వారికి వారినిబోలిన వారికి గల అసూయా ద్వేషములు భూగోళముపైగల సమస్త జీవరాసులను మారణ హోమమున ఆహుతిగావింపగలవు. రాజ్యాధినేతలకు ఈ శక్తినిచ్చినది ఒకటికి మారణాయుధములను తయారుచేయు శాస్త్రజ్ఞులు కూలికి వాటినిపేల్చు సైనికులు.

వీరు దుష్కృత్యమునకు బాధ్యులు. రాజకీయ సిద్ధాంతము ప్రతిపాదించి తద్వారా మారణహోమము చేయుసధికారమును పరిపాలకులకు ధారదత్తము చేసిన రాజకీయసిద్ధాంతులు ఈ పాపములకు కారకులు. వీరి దౌష్ట్యాన్ని ఖండించ వలసిన అవసరము ఎంతైనా వున్నది

కవిరాజు "ఖూనీ" నాటకములో వేనరాజు పాత్రను పాలకులకు ఆదర్శ ముగా తీర్చిదిద్దినాడు. ధర్మసంస్థాపన అతని ధ్యేయము. అతని ఖడ్గధారా దావళ్యము చూచి జారచోరులు పరసీమలకు దారితీసిరి. ప్రజలు పిక్కబెదురు లేక తమతమ కార్యములలో నిమగ్నులైరి. జంతుబలితో కూడి యజ్ఞములను ఆపినందుకు వైదిక మతోన్మాదులు వేనరాజుపైన కుట్రచేసిరి. వేనరాజు ప్రతీకా రమునకు గడంగలేదు. ఒక్కనికోసము వేలకొలది జనంబులు రూపుమాయు టేలయనెను. కత్తులు తనపై కెగసినను కత్తిముట్టలేదు. ఈనాటి పాలకులు వేన రాజును అనుసరించవలెనని కోరుకొందము.

మంచి చెడులకు కొలబద్ద గెలుపు ఓటమి కాకూడదని రామస్వామిగారి వాదము. మంచి ఓడినప్పుడు వెన్నుకాయటము ఆయన పద్ధతి. చెడు గెల్చినప్పటికీ ఖండించటము ఆయన ప్రకృతి. ఇది సాహిత్యములో నలగని దారి. ఈ దారిలో మానవాళి నడచినప్పుడు మంచికి తోడ్పాటు కలిగి పెరుగుతుంది. చెడును బొదల దాల్చుట తరగి క్రుంగుతుంది. కవిరాజమార్గము లోక కళ్యాణమార్గము.

నలగని దారిలో నడిచి, ఇతరులు నడవటానికి తోడ్పడిన రావెల సాంబశివరావును అభినందించుచున్నాను.

-జొన్నలగడ్డ రామారావు

—o—

